THE ANDHRA PATRIKA, MADRAS.

# ఆంధ్రపత్రిక

3/80 33

Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 112 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. సోమవారం 23—7—1951 వెల 1 అణా.



# 'పాకిస్థాన్‌పై ఇండియా దురాక్రమణ జరుపుతుందంటే నమ్మజాలని విషయం'

## 'నెహ్రూ హితవును పాటించి మేము మంత్రి పదవుల్లో వుంటున్నాము'

### కిద్వాయ్, జైన్‌గార్ల ప్రకటన: ప్రధాని హర్షం

ఢిల్లీ, జూలై 21: భారత ప్రధాని పండిత నెహ్రూగారు ఈ క్రిందిరీతిగా నేడొక ప్రకటన చేసిరి:

భారత ప్రభుత్వ తంతి తపాలా శాఖామంత్రి రఫీఅహమ్మదుకిద్వాయి గారును, కాందిశీక పునరావాసశాఖా మంత్రి శ్రీ అజిత్ ప్రసాద్ జైయినుగారును మంత్రివర్గములోని తమ పదవులకు రాజీనామాల నిచ్చిరి. వారి రాజీనామాలు నాకు చేరినవి. ప్రభుత్వ వ్యవహార విధానములో అభిప్రాయ భేదములు ఏమియు ఏర్పడలేదనియు, ఆ కారణంచేత యీ రాజీనామాలను దాఖలు చేయలేదనియు వారు నాకు వ్రాసిరి. తాము అనుసరించిన యితర చర్యలకు ఫలితముగా యీ రాజీనామాలను ఇచ్చుచున్నామని వ్రాసిరి. వారు అనుసరించిన యితర చర్యల విషయమై ప్రత్యేకించి యోచించవచ్చును. ప్రభుత్వవర్గములో ఉండి వారు చేసినసేవ చాలా గణుతింపదగి యున్నది. అందుచేత వారి రాజీనామాలు నాకు చేరినప్పుడు నేను చాలా చింతించాను. అదిన్నీ గాక ప్రస్తుత క్లిష్ట పరిస్థితిలో ముఖ్యంగా వారి రాజీనామాలను అంగీకరించుట నాకెంత మాత్రము యిష్టములేదు. అందువల్ల వారి రాజీనామాలను ఉపసంహరించుకోవలసినదిగా నేను కోరినాను. వారు నా సలహాను గౌరవించి తమ రాజీనామాలను ఉపసంహరించుకొన్నందుకు సంతోషమైనది.

**కిద్వాయి ప్రకటన**

రఫీ అహమ్మదు కిద్వాయిగారును, అజిత్ ప్రసాద్ గారును సమిష్టిగా నేడొక ప్రకటన ఈ క్రింది రీతిగా చేశారు:

ప్రభుత్వ బాహుళ్య వ్యవహార విధానములను మేము ఆమోదించుచున్నాము. అట్టి వ్యవహార విధానముల క్షేమలాభంకోసం ప్రధానమంత్రి పండిత నెహ్రూ మమ్ములను కోరినందువల్ల మేము మా నాయకుని సలహాను శిరసావహించి మంత్రులుగా నుండి పనిచేయుటకు అంగీకరించితిమి. పండిత జవహర్‌లాలు నెహ్రూ గారు కాంగ్రెసు వాది హోదాలోను, ప్రభుత్వ నాయకుని హోదాలోను చేసిన రెండు అభిప్రాయ ప్రకటనలను మేము చదివి మాచినాము. కాంగ్రెసు సంస్థయొక్క వ్యవహార నిర్వహణ విషయములో ప్రస్తుతము మాకుగల అభిప్రాయ భేదములు జగద్విదితములు. పునశ్చరణ చేయవలసిన అవసరంలేదు. సుమారు 30 సంవత్సరాలుగా సన్నిహిత సంబంధం కలిగిఉంటున్నటువంటి కాంగ్రెసులోనుండి విడిపోవుటకు మాకు కూడా మనస్సుకు చాలా కష్టంగానే ఉండి.

కాని మాకు మరొక గత్యంతరం కన్పించలేదు. మేము చాలా తొందరపడి యీ చర్యను అనుసరించాము అని జవహర్‌లాలు నెహ్రూగారు అన్నారు. వారియందు మాకు పరిపూర్ణ గౌరవభావం ఉంది. వారి అభిప్రాయాన్ని మేము ఆమోదించడం లేదు. కాంగ్రెసు సంస్థయందు ప్రజాస్వామ్య ధర్మసూత్రములను సరిగ్గా వర్తింపజేయవలసియున్నదని ఆయనకు మేము అనేక సంవత్సరాలుగా నొక్కి వక్కాణిస్తున్నాము. కాని, అటువంటిది ఆయన సాధింపలేకపోయినాడు. ఈ కాంగ్రెసు సంస్థ ఏ ధర్మసూత్రములను చాటించుచున్నదో, ఆ సంస్థయొక్క అధ్యక్షుడు ఆ ధర్మసూత్రములకే ప్రత్యక్ష ప్రతికూలముగా ప్రవర్తిస్తున్నాడు. దీనికిసాటి మరొక ఉపమానం వున్నదా అనిపిస్తుంది. ఆర్థిక విషయములలోను, మతసంఘ విభేద వ్యవహారములలోను అంతర్జాతీయ వ్యవహారములలోను, కొంది శిరుల విషయములోను కాంగ్రెసు నిర్వచించిన వ్యవహార వైఖరికిన్ని బాబు పురుషోత్తముదాసు టాండను అనుసరించే పద్ధతులకున్ను ఏమైనా పొలికయున్నదా? కాంగ్రెసు మహాసభ పైకిచెప్పేది ఒకటి. చేసేది ఇంకొకటిగా వుంది. మేము దానిలో నుంచి విడిపోయి బయటకు వచ్చినతర్వాతనైనను కాంగ్రెసు మహాసభ తన సిద్ధాంతాలను తాను అనుసరించి వ్యవహరించవలెనని ఆశిస్తున్నాము.

మేము మంత్రులుగా నియమింపబడుటకున్న మా కాంగ్రెసు సభ్యత్వమునకున్న సంబంధం లేకపోలేదు. కాబట్టి మా కాంగ్రెసు సభ్యత్వానికి మేము రాజీనామా నిచ్చినందువల్ల,

(2 వ పేజి చూడుడు)

### హైద్రాబాదులో కమ్యూనిస్టు సభల నిషేధం

హైదరాబాదు, జూలై 21: హైదరాబాదు నగర పరిసరాల్లో ఎక్కడా నేటినుంచి వారంరోజుల పాటు కమ్యూనిస్టు పార్టీగాని, దాని నాయకులుగాని ఎలాటి సభలూ జరపరాదనీ, అయిదుగురికి మించి ఎక్కడా సమావేశం కారాదనీ హైదరాబాదు జిల్లా మేజిస్ట్రేటు నేటి దినం144వ సెక్షనుక్రింద నిషేధాజ్ఞ జారీ చేశారు.

ఇలాటి ఉత్తరువే సికిందరాబాదులోకూడా అడిల్లా మేజిస్ట్రేటుచే జారీ చేయబడింది.

ఇందుమూలాన జ్యోతి బసు, ముజఫర్ అహమద్, ఎ. కె. గోపాలన్‌గార్లు ఇవాళ సాయంత్రం సికిందరాబాదులో మాట్లాడదలచుకొని యుండిన బహిరంగసభ జరపడం మానివేశారు.

సంస్థానంలో కమ్యూనిస్టుపార్టీపై నిషేధం అమల్లో వున్నదనీ, అందువల్ల ఆ పార్టీ యాజమాన్యాన నడిచే బహిరంగసభలకు ప్రభుత్వం అనుమతింపజాలదనీ ఒకానొక ప్రభుత్వ ప్రతినిధి యీ144వ సెక్షను ప్రయోగాన్ని సమర్థిస్తూ చెప్పారు.

## పర్షియా నూనె సమస్యపై హారిమన్ కొత్త సూచనలు

### టెహరాన్ అధికారవర్గాలకు సంతృప్తికరంగానే వున్నట్లు ప్రకటన

టెహరాన్, జూలై 21: బ్రిటన్, పర్షియాలమధ్య ఏర్పడిన నూనె తగాదా పరిష్కారానికిగాను అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ప్రత్యేక ప్రతినిధి ఎవరెల్ హారిమన్ నేటి రాత్రి పర్షియా ప్రభుత్వానికి కొత్త ప్రతిపాదనలు చేసినట్లు ఇక్కడి అధికారవర్గాలవారివల్ల తెలుస్తున్నది.

పర్షియా నూనెసంఘ సభ్యులతో హారిమన్, ఆయన సలహాదారులు జరిపిన ప్రత్యేక సమావేశంలో ఆ ప్రతిపాదనలు జరిగినట్లు తెలుస్తున్నది.

అబదాన్ నుంచి నూనె రవాణా చేసే నౌకల అధిపతులు సంతకం చేయవలసిన రసీదు విషయంలో కూడా ఒక ప్రతిపాదన జరిగినదట. తతిమ్మా ప్రతిపాదనలు ఏమైనది తెలియదు.

పర్షియా ప్రభుత్వ ప్రతినిధులు వాటిని ప్రధాని డాక్టర్ మహమ్మద్ మొసాదిక్‌కు నివేదిస్తారనీ, అనంతరం వారు మరొకపర్యాయం హారిమన్‌తో సమావేశం జరుపుతారనీ ఇక్కడి అధికారవర్గాలవారు చెబుతున్నారు. నేటి ప్రత్యేక సమావేశం హారిమన్ అభ్యర్థనపై టెహరాన్‌కు ఉత్తరంగా ఉన్న పర్షియారాజు వేసవి భవనంలో జరిగినది. ఆ సమావేశం రెండు గంటల సేపు జరిగినది. సంభాషణలపై వ్యాఖ్యానించడానికి పర్షియా ప్రతినిధులు నిరాకరించారు.

హారిమన్ ప్రతిపాదనలు పర్షియనులకు సంతృప్తికరంగా ఉన్నవనీ, వాటి ఫలితంగా బ్రిటన్‌తో రాయబారాలు పునః ప్రారంభం కావచ్చుననీ ఇక్కడి అధికారులు సూచించారు.

టెహరాన్‌లోని బ్రిటిష్ రాయబారి సర్ ఫ్రాన్సిస్ షెప్పర్డ్ ఈ రోజు షా వేసవిభవనంలో హారిమన్‌ను కలుసుకుని, ఆయనతో రెండు గంటలసేపు చర్చించారు.

ప్రధాని మొసాదిక్‌తోను, ఇతర పర్షియా నాయకులతోను జరిపిన సంభాషణలపై హారిమన్ శనివారంనాడు ఒక ప్రకటనచేశారు. దానిలో ఇలా ఉన్నది:- "ఇరాన్ జాతీయ ఆశయాల సాధనకు, నూనె [illegible] [illegible]

నది. ఇరాన్ ఆర్థికాభివృద్ధికి తయారైన ప్రణాళికలపైకూడా నేను చర్చించాను. ఇరాన్ సర్వతోముఖాభివృద్ధికి చాల అవకాశాలున్నవని గుర్తించాను" హారిమన్ రేపు ఇస్ఫహాన్ వెళ్ళే ప్రయత్నం విరమించుకున్నారు.

ఈ లోగా ఆంగ్లో ఇరానియన్ నూనె సంస్థపై పర్షియా జరిపిన చర్యలపై బ్రిటిష్ ప్రభుత్వ ఆక్షేపణ తెలియపరిచే అవకాశానికై ఇక్కడి బ్రిటిష్ రాయబార కార్యాలయ పలహాదారు జార్జి మిడిల్‌టన్ నిరీక్షించి ఉన్నారు.

## మధ్యప్రాచ్య రక్షణ

### అమెరికా సైనికసహాయం అవసరమని అడ్మిరల్ షర్మన్ అభిప్రాయ ప్రకటన

వాషింగ్టన్, జూలై 22: మధ్యప్రాచ్యానికి, తూర్పు మధ్యధరా ప్రాంతానికి ఇతోధికంగా సైనిక సహాయం చేయాలని అమెరికా నౌకా బలాధ్యక్షుడు అడ్మిరల్ ఫారెస్టు షెర్మన్ నిన్న అభ్యర్థించారు.

అమెరికా ప్రతినిధులసభ విదేశాంగ వ్యవహారాల సంఘానికి ఆయన తిరిగివచ్చిన ఉపన్యాసంలో వైస్ అడ్మిరల్ [illegible] సమర్పించిన లేఖలో షెర్మన్ ఇలా నివేదించారు:—

"ఆ ప్రాంతంలో అంతటా రాజకీయ, ఆర్థిక స్థిరత్వం నెలకొల్పడానికి అమెరికా [illegible] [illegible] ప్రాంతంకూడా [illegible] ప్రధానమైనది. [illegible] బలపరచడానికి కూడా అమెరికా తోడ్పడాలి."

**సైన్యాధికార వ్యవస్థ మార్పు చేయడానికి అవకాశాలు**

కేప్టల్స్, జూలై 21: మధ్యప్రాచ్య రక్షణకు మిత్రరాజ్యాలు దిద్దుబాటుచేసిన ప్రణాళికలకనుగుణంగా నెలకొల్పిన సైన్యాధికార వ్యవస్థను పరిస్థితులకు అనుగుణంగా మార్పు చేయడానికి అవకాశం ఉన్నదని అమెరికా నౌకాబలాధ్యక్షుడు అడ్మిరల్ షెర్మన్ నేడిక్కడ ప్రకటించారు.

ఈ వారంలో స్పెయిన్‌లో జరిపిన [illegible] మార్పు చేయవలసి వస్తుందా అని ప్రశ్నించగా ఆయన సమాధానం చెప్పడానికి నిరాకరించారు.

## అజ్జంపాషా ప్రకటన

### నెహ్రూ నాయకత్వాన అది అసంభవమని ఉద్ఘాటన

కెయిరో, జూలై 21: "పాకిస్తానుపై దండెత్తవలెనన్న వ్యగ్రభావం భారతదేశానికి ఉన్నదంటే నేను నమ్మజాలను" అని నేడు అరబ్ రాజ్య సమితి ప్రధాన కార్యదర్శి అజ్జాంపాషా ఇండియా పాకిస్తాన్ సంబంధాలనుగూర్చి విమర్శిస్తూ ఒక ప్రకటన చేశారు.

నేను ఆ రెండు రాజ్యాలకుమధ్య ఏర్పడిన ఉద్రేకభావమును చూస్తే ఆ రెండు రాజ్యాలకు మిత్రులైన యితర రాజ్యాలవారికిచాలాకంగారుగాఉంది. ఈ రెండురాజ్యాలకు మిత్రులుగా ఉంటున్నవి. అరబ్బీ రాజ్యాలు ఉన్నతాదర్శ పురుషుడును, మానవాభ్యుదయాభిలాషియునగు పండిత జవహర్‌లాలు నెహ్రూవంటివాని నాయకత్వం క్రిందనున్న భారతదేశానికి తన పొరుగు రాజ్యంపై దండెత్తవలెనన్న సంకల్పంఉన్నదంటే, భారతదేశమును మిత్రరాజ్యాలు నమ్మజాలవు. ఉభయ రాజ్యాలకు మధ్య పరస్పర అవిశ్వాసం ఏర్పడిన తరుణంలో సరిహద్దులవద్ద భారతీయసేనలు చేర్చబడుట కొంత ఆదుర్దాకు కారణభూతంగా ఉంది. ఆ రెండు రాజ్యాలకు మధ్య యీ వివాదమును సర్దుబాటు చేయుటకు ఎట్లా తోడ్పడవలెనో మాకు బోధపడడంలేదు. కాని, యీ పరస్పర ఉద్రేక భావమును ఉపశాంతించుటకు తగిన పరిష్కారమార్గము కన్పిస్తే మేము చాలా సంతోషిస్తాం.

**భారత ముస్లిములకు రాంపూరు నవాబుగారి హెచ్చరిక**

లక్నో, జూలై 21: నేడు లక్నోలో జరిగిన అఖిల భారత షియాము సల్మానుల మహాసభకు అధ్యక్షుడైన రాంపూరునవాబను సర్ సయ్యదు రజా అలీఖానుగారు నేడుచేసినప్రకటనలో యిలా అన్నారు.

తూర్పు పాకిస్తాను సరిహద్దులో పాకిస్తాను సేనలను విస్తారంగాచేర్చడం కుద్ర మొండితనం తంత్రంగా ఉంది. భారతదేశం సరిహద్దులవద్ద న్యాయంతో ఉంచవలసిన సేనలు ఉన్నందుకై దొంగలన్నట్లు కార్చడం కూడా గయ్యాళితనంప్రదర్శనంగా ఉంది. భారతదేశంలోని మహమ్మదీయులందరు ఏకముఖంగా ప్రధానమంత్రి పండిత నెహ్రూగారికి అండగా నిలువబడాలి. భారతీయులతో చేతులు కలిపి నిలువబడాలి. పండిత నెహ్రూ భారతమాత ప్రియపుత్రుడు. ఈ స్వతంత్ర భారతదేశము మతాభిమానవిభేద భావరహితమైన రాజ్యముగా పౌరులందరికీ మతవిచక్షణ లేకుండా సమానావకాశాలను కలుగజేస్తోంది. మతవిభేదరహితమైన యీ రాజ్యము యొక్క భద్రతకు భంగం లేకుండా కాపాడగల కార్యభారమంతా నెహ్రూగారి మీదనే ఉంది. మహమ్మదీయులు, హిందువులు రెండు భిన్న జాతులవారనే ద్విజాతీయ సిద్ధాంతము చాలాకాలం క్రిందటనే ఖండింపబడింది. కాని పాకిస్తాను యింకా ఆ సిద్ధాంతమునే పట్టుకొని ప్రాకులాడుతోంది. ప్రపంచాన్ని యింకా ఆ సిద్ధాంతప్రచారంతో మోసగించ ప్రయత్నిస్తోంది. విభేదాలను, చీలికలను ఏర్పరచుటకు పెనుత్రోవల త్రొక్కినవారు కొందరు ప్రయత్నించి నప్పటికి, మునముందర మహాత్ముని నాయకుని నాయకత్వం క్రింద ఏకమై ఒక్క జాతిగా నియమింపబడవలెను.

పాకిస్తాను యెడల భారతదేశము సదా స్నేహభావమును చూపుచునే యున్నది. పాకిస్తాను పంపినట్లుగా తూర్పు పాకిస్తానులోనికి దుండగీం డ్లను దండెత్తుటకై, సులభంగా సంపి దిమెంపవచ్చును. కాశ్మీరులోపాకిస్తాను ప్రవర్తించినట్లుగా భారతదేశం కూడా ప్రవర్తించియుండవచ్చును. కాని, మేము పాకిస్తానుయెడలస్నేహభావను ఉద్దేశించి స్నేహభావంతోనె వ్యవహరిస్తున్నాము కాని పాకిస్తానుమాత్రము తన పొరపాటులను తెలిసికొనలేదు. [illegible] దురభిప్రాయములను [illegible] కూడదు.

### అమెరికా ఆహార నౌక

**బొంబాయి రేవులో స్వాగతానికి ఏర్పాటు**

బొంబాయి, జూలై 21: అమెరికా నుండి ఇండియాకు ఆహార ధాన్యాలు రవాణా చేసే నౌకలలో మొదటిది "జాన్ ఫోస్టర్ కెండాల్" వచ్చేవారం బొంబాయి రేవు చేరుకొనున్నది. అనాకకు ప్రభుత్వ మర్యాదలతో స్వాగతం ఇవ్వడం జరుగుతుంది. ఈస్వాగత సత్కారాలలో బొంబాయి మేయరు, బొంబాయి ప్రభుత్వము, భారత ప్రభుత్వము పాల్గొనున్నది.

## జోర్డాన్ రాజరికం విషయమై తగాదా

### అబ్దుల్లా రాజు హత్య విశేషాలు: మధ్యప్రాచ్య నైతికపతనావస్థపై విమర్శ

లండన్, జూలై 22: అబ్దుల్లారాజు అనంతరం జోర్డాన్ సింహాసనాన్ని ఎవరు యెక్కుతారు? అనే విషయం అరబ్బీ రాజ్యాలన్నింటిని వేధిస్తున్న పెద్ద సమస్యగా సంసిద్ధమౌతున్నది.

అబ్దుల్లా రాజుకు తన పెద్దకొడుకు అమీర్ తలాల్ తన తర్వాత రాజు అవడం ఇష్టంలేదని ఈ అభిప్రాయంతో బ్రిటిష్ ప్రభుత్వం ఏకీభవించిందని అక్బార్ ఎల్ యోమ్ అనే కెయిరో పత్రిక జెనీవా విలేఖరి వ్రాస్తున్నాడు.

తన తండ్రి హత్య చేయబడినట్లు తెలియగానే యువరాజు తలాల్ స్విట్జర్లాండునుంచి అమ్మాన్‌కు ప్రయాణం కట్టినాడటగాని, డాక్టర్ల సలహావల్ల ఆ ప్రయాణాన్ని ఆయన ఆపినట్లు తెలుస్తున్నది.

అయితే, తన తండ్రి మరణం అనంతరం, జోర్డాన్ ప్రభుత్వం తన్ను ఇంకా యువరాజ పదవిలో ప్రకటనలలో వ్యవహరిస్తూవుండటం ఆయనకు నచ్చినట్లు కన్పించడంలేదు. అట్లా అని, ఆయన అన్నట్లు అక్బార్ ఎల్ యోమ్ వ్రాస్తున్నది.

జోర్డాన్ భవిష్యద్రాజరికసమస్యను గూర్చి అరబ్‌లీగ్ కార్యదర్శి అజంపాషా నేడొక ప్రకటన చేసారు. జోర్డాన్ సింహాసనాన్ని అధిష్టించడానికి ముందు అమీర్ తలాల్‌ను వైద్యులు పరీక్షచేసి, అందుకు అనుమతించవలసి వుంటుందని ప్రవర్తమానం అవుతున్నవార్తలు అరబ్బులకు అవమానకరంగా కన్పిస్తున్నాయి. అరబ్బీ రాజ్యాల రాజ్యాంగసంప్రదాయాలను అంతా గౌరవించాలి. ఇందులో ఇతర దేశాల ప్రమేయం ఏ్రంతమాత్రం సహించేదిలేదు అని ఆయన అన్నారు.

పోతే ఇక అబ్దుల్లా హత్యకు, గత మంగళవారంనాడు జరిగిన రియాద్ ఎల్‌సోల్హ్ హత్యకు ఏదో సంబంధం వున్నదని అభిజ్ఞులు భావిస్తున్నారు. ఈయన లెబనాన్ మాజీ ప్రధాని ఇజ్రాయిల్‌తో సంధి చేసుకోడాన్ని గూర్చి చర్చించడానికి ఆయన అమ్మాన్ వచ్చారు. ఏమైనా అబ్దుల్లా రాజు ఈ హత్యవల్ల అరబ్ రాజకీయాల్లో చిక్కులు పుట్టినా పుట్టగలవని పరిశీలకులు భావిస్తున్నారు. ఈ విషయాన్ని చర్చించడానికి సిరియా ప్రభుత్వం నేడు సమావేశం అవుతున్నది. త్వరలోనే అరబ్‌లీగు రాజకీయ సంఘం సమావేశంగూడా జరుగుతోంది. ఈజిప్టు ప్రభుత్వానికి అనుకూలంగా వ్యవహరించే అల్ మిస్రీ పత్రిక, ఈ హత్యలు అరబ్ లోకంయొక్క నైతిక పతనాన్నే కాకుండా, ఎంతటి విద్రోహకరమైన రాష్ట్రీ ద్రోహ ప్రవృత్తిలో చిక్కుకొని పోతున్నదో తెలియజేస్తున్నదని వ్రాసింది.

జెరూసలెం మాజీమఫ్టీ అబ్దుల్లా రాజు హత్యనుగూర్చి విపరీత వ్యాఖ్యానాలు చేయడాన్ని ఖండిస్తూ నేడొక ప్రకటన చేసారు. ఇట్టి వ్యాఖ్యానాల మూలంగా అరబ్బీ లోకంలో ఎట్టి ప్రతీకారచర్యలు బయలుదేరినా అందుకు జోర్డాన్‌తోపాటు బ్రిటన్‌కూడా బాధ్యత వహించవలసి వుంటుందన్నారు. అబ్దుల్లాను చంపిన వానితో నాకెట్టి సంబంధం లేదు. అయితే అతను నా ఆధిపత్యంలో పనిచేసిన వాలంటీరు సైన్యాల్లో ఒక సైనికుడైవుండవచ్చు.

అంతమాత్రంచేత చేసేది ఏమీలేదు. రియాద్ ఎల్‌సోల్హ్ కూడా జోర్డాన్ అరబ్ లీజియన్‌కు చెందినవాడు ఒకడు చంపాడు. అందుకు ఆ బాధ్యత దానిమీద వేయగల్గితే, అందుకు ఈ బాధ్యత దీనిమీద వేయవచ్చుఅని మాజీ మఫ్టీ అన్నారు.

ఇవ్వాళ్ల జోర్డాన్ రాజధాని అమ్మాన్‌లో అంతా శాంతంగావుంది. జరూసలెంలోను, ఆ ప్రాంతం అబ్దుల్లా రాజు హత్య అనంతరం అమలుజరిపిన కర్ఫ్యూ పరిమితిని 24 గంటలనుంచి ఇప్పుడు 12 గంటలమేరకు తగ్గించివేసారు. అబ్దుల్లాహత్యకు కారకులైనవారిని ఖండిస్తూ జోర్డాన్ ప్రధాని ఒక ప్రకటనచేసారు. ఈరకం బుద్ధి గలవారు చాలా అల్పసంఖ్యాకులు వుంటారు. ఈ కష్టసమయంలో వారి ఆటలు సాగకుండా చూడడానికి విచక్షణాజ్ఞానంగల అధిక సంఖ్యాకులైన ప్రజలు తోడుపడటం అవసరం. ఇది రాజుగారి అంత్యక్రియలు ప్రశాంతి వాతావరణంలో జరిగి పోవడానికి ఎంతో తోడ్పడుతుంది. ప్రభుత్వం శాంతిభద్రతలను కాపాడడానికి అన్ని బందోబస్తులు చేసిందిఅనిఆయన ఈప్రకటనలో వివరించారు.

హంతకుని తుపాకికి బలి అయిపోయిన అబ్దుల్లా రాజు 'అల్లా' నామాన్ని స్మరిస్తూ ప్రాణాలు విడిచినట్లు ఆ దృశ్యాన్ని కళ్ళతో చూచినవారు చెబుతున్నారు. హంతకుడు ఒక్కడే కాదని, అతనికి దాదాపు మరి 20 మందిగూడా తోడుగా వచ్చారని, అతడు రాజుమీద తుపాకీ గురిచూచి కాల్చగానే, వారు ఆ రాజు అంగరక్షకులమీద కాల్పు సాగించారని, ఆ తర్వాత ఆ అంగరక్షకులకు వీరికి కొంత పోరాటం జరిగిందని, వారు పారిపోయారని గూడా వీరు అంటున్నారు. రాజును చంపిన హంతకుణ్ణి ఆయన అంగరక్షకుడు కాల్చి వేయడం వీరంతా చూచారు. హత్య జరిగిన అనంతరం గంటన్నర తరువాత అబ్దుల్లా రాజు శవాన్ని విమానంమీద జెరూసలెంనుంచిఅమ్మాన్‌కుతీసుకుపోయారు.

అబ్దుల్లా రాజు హత్యచేయబడినట్లు విని తాను దిగ్భ్రాంతి పొందినట్లు బ్రిటిషు రాజు ఆరవ జార్జి, ప్రస్తుతం జోర్డాన్ రీజంటుగా పనిచేస్తున్న అమీర్ నైఫ్‌కు పంపిన సందేశంలో వెల్లడిచేశారు. (అమీర్ నైఫ్ అబ్దుల్లా రెండో కొడుకు) తాను, రాణీగారు, ఈ వార్త వినీ ఎంతో దుఃఖించినట్లు ఆయన ఈ సందేశంలో తెలియజెప్పారు, అబ్దుల్లా రాజు మరణంపట్ల సానుభూతి తెలుపుతూ ఈజిప్టు కొలువు కూటం ఇప్పటినుంచి ఏడురోజులు విషాదసూద్రవహించాలని ఫరూక్ రాజు ఉత్తర్వుచేశారు. అంకారాలో అబ్దుల్లా రాజు హత్యావార్త ఎక్కువ విషాదాన్ని కల్గించింది. ఆయనకు ఇన్నాటకుంచి జనాదరణం వుండె. రాజకీయవర్గాలలో అబ్దుల్లా మరణంవల్ల మధ్యప్రాచ్య రాజకీయాలు [illegible] గట్టి దెబ్బ తగిలినట్లు కన్పిస్తున్నది.

## పాకిస్తాన్ సైనికసంచలనానికి నిదర్శనలు

### చీకటి మరుగున సరిహద్దులలో కదలిక

షిల్లాంగు, జూలై 21: తూర్పు పాకిస్తానులోని సరిహద్దులవద్ద పాకిస్తాను సేనలు ఎక్కువగా చేర్చబడుతున్నట్లుగా, షెల్లా, భోలాగంజ్, బాలాత్, డాకీ అనే ప్రదేశాలనుండి రూఢియైన వార్తలు వస్తున్నవి.

ఈ ప్రదేశాలు ఖాసీకొండలవద్ద ఉన్నవి. సరిహద్దువద్ద ఉన్న భోలాగంజ్ పోస్టాఫీసు భారత ప్రభుత్వాధికార ప్రాంతంలో చేరినదే—అయినప్పటికీ, పాకిస్తాను ప్రభుత్వము దానిని నిర్వహిస్తోంది. ఆ సరిహద్దులలో ఉన్న పాకిస్తాను రహస్య పోలీసులు, గూఢచారులు పోస్టాఫీసులో తమకు పని ఉన్నట్లుగా నటించి ఈ భారతప్రభుత్వ ప్రదేశంలోకి ప్రవేశించి తమకు కావలసిన ఫోటోలన్నీ తెలిసికొని పోతున్నారు. ఈ సరిహద్దు ప్రాంతంలో పాకిస్తానుసేనలు రాత్రి వేళలందు చీకట్లో ఒకచోటినుండి యింకొకచోటికి కదలి, వెళ్లుతున్నవి. పాకిస్తానులోని సరిహద్దుప్రాంతపు బజారులందు యిప్పుడు దుకాణాలు ఏమీ లేవు. అచటి సామాన్య పౌర జనులు యితర ప్రాంతాలకు వెళ్లి పోయినారు. యు. పి. ఐ.

**పాకిస్తాన్ ముస్లింలీగ్ అవసర సమావేశం**

పాకిస్తాను సరిహద్దులవద్ద భారతీయ సేనలు ఎక్కువగా చేర్చబడినందువల్ల ఏర్పడిన ప్రమాద పరిస్థితినిగూర్చి చర్చించుటకై జూలై 24 వ తేదీని కరాచీలో పాకిస్తాను ముస్లింలీగు కార్యవర్గం జరూరుగా సమావేశమగునని పాకిస్తాను ముస్లింలీగు ప్రకటించింది.

పాకిస్తాను ముస్లింలీగుకు పాకిస్తాను ప్రధాని లియాకతలీఖానుగారే ప్రెసిడెంటు. ప్రపంచ ముస్లిం మహాసభయొక్క కార్యవర్గముకూడా ఇందు నిమిత్తమే నేటి సాయంకాలము కరాచీలో సమావేశమగుచున్నది.

### పంచవర్ష ప్రణాళిక అమలుకు నాంది

**మొదటియేడాది ఖర్చుకు బడ్జెటులో కేటాయింపు**

హైదరాబాదు, జూలై 22: సంస్థానం తాలూకు పంచవర్ష ఆర్థికాభివృద్ధి ప్రణాళికను అమలుపరచడానికి మొదటి సంవత్సరానికి పట్టే ఖర్చు నిమిత్తం హైదరాబాదు ప్రభుత్వంవారు ఈ సంవత్సరపు బడ్జెట్టులో తగినంత అవకాశం కల్పించి వున్నట్లు ప్రభుత్వ ప్రతినిధి ఒకరు ఇవాళ పి. టి. ఐ. విలేఖరితో చెప్పారు.

సుమారు 61 కోట్లరూపాయల ఖర్చు పట్టే యీ పంచవర్ష ప్రణాళికను ప్లానింగు కమీషనువారు తప్పకుండా ఆమోదిస్తారనే నమ్మకంతో మొదటి సంవత్సరపు ఖర్చు కింద 7, 8 కోట్ల రూ.లు ఈ బడ్జెట్టులో కేటాయించారని ఆయన అన్నాడు. ప్రణాళికలో చాలా భాగాన్ని ప్లానింగు కమీషను ఆమోదించిందని కూడా ఆయన చెప్పాడు.

ఈ ప్రణాళికకు పట్టే మొత్తం ఖర్చులో సంస్థాన ప్రభుత్వం అయిదు సంవత్సరాలకూ కలిపి 30 లేక 35కోట్లు ఖర్చు స్వయంగా భరిస్తుంది. మిగతా దానికి కేంద్రంమీద ఆశ పెట్టుకొన్నది.

### గంటకు 1200 గజాల నూలు వడికే రాటం

బెంగుళూరు, జూలై 21: గంటకు 1200 గజముల నూలువడికే కొత్తరకపు రాట్న ప్రదర్శనము నేటి మధ్యాహ్నము మైసూరు ముఖ్యమంత్రి యెదుట జరిగింది. ఈ రాట్నంమీద మధ్య కొద్ది విరామంతో ఏకధాటిగా 8 గంటలు పని చేయ వచ్చునని, నూలు వడకడము పురి ఎక్కించటము, చుట్టటము వాటంతట జరిగి పోతవని ఈ రాట్నమును కనిపెట్టిన శ్రీ డి. వి. రాజగోపాల్‌గారు చెప్పుతున్నారు. రాజగోపాల్‌గారికి దీనిమీద పేటెంటు హక్కులవు. ఉత్పత్తి విశేషంగా హెచ్చించడానికి ఈ కొత్త రాట్నాలను విరివిగా నిర్మించే కార్ఖానాను ఏర్పరచాలని తాను మైసూరు ప్రభుత్వాన్ని అభ్యర్థించదలచినట్లు శ్రీ రాజగోపాల్‌గారు చెప్పారు.

## కేసాంగ్ చుట్టూ కమ్యూనిస్ట్ సేన

### సమాలోచనల నిలుపుదలకు కారణం

టోకియో, జూలై 22: కేసాంగ్ సమాలోచనలు ప్రారంభం అయిన మొదటివారంలో జనరల్ రిడ్జివే వాటిని కొంతకాలం ఆపడానికి కారణం కమ్యూనిస్టు సైన్యాలు దాదాపు 32 వేలదాకా ఆ పట్టణంచుట్టూ సమకృతం అయివుండడమేనని సమితి సన్నిహిత వర్గాలవారు నేడు చెప్తుంటున్నారు.

ఈ 32 వేల సైన్యాన్ని కమ్యూనిస్టు ప్యాంగ్యాంగ్ నుంచి ఇచ్చటకు తెచ్చారు. రాత్రింబగళ్లు ప్రయాణం చేసి ఈ సైన్యాలు రోజుల్లో కేసాంగ్ పరిసరాలను చేరుకోగల్గాయి.

ఇప్పుడుగూడా కమ్యూనిస్టులు 3 లక్షల సైన్యాన్ని యుద్ధానికి సన్నద్ధం చేసి సిద్ధంగా వుంచినట్లు నిన్న 8వ సైన్య కార్యాలయం ప్రకటించింది. ఇంతకు ఒక వారం రోజుల క్రితం సియోల్ మీదపడేందుకు సిద్ధంగా 70 వేల సైన్యం మోహరింపబడివున్నట్లు వార్తలు ప్రబలుతూవచ్చాయి. ఈ వార్తలను ఎవరూ ధ్రువపరచనూలేదు; ఎవరూ ఖండించనూలేదు: ఇంతటి ఉపద్రవాన్ని జనరల్ రిడ్జివే, కేసాంగ్ సమాలోచనలు ప్రారంభం అయిన తర్వాత తెలుసుకొన్నారు. కమ్యూనిస్టులు తమ పరతులను బలాన్ని చూపి నెగ్గించుకోడానికి చేసిన ఈ ప్రయత్నాన్ని ఆయన చూడకుండా వదిలివేసేందుకు వీలులేకపోయింది. అందువల్ల ఆయన ఆ సమాలోచనలను అప్పటికి ఆపించి, ఎట్టి వాతావరణంలో అవి జరగవలసివుందో ఖచ్చితంగా కమ్యూనిస్టులకు తెలియజెప్పారు. అని ఈ వర్గాలవారు వివరించారు.

మద్రాసు, జూలై 21: బర్మానుంచి 7190 టన్నుల బియ్యాన్ని వేసుకొని సూర్యహార్ అనే ఓడ కొచ్చిన్ హార్బరు చేరింది. ఇందులో 800 టన్నులు మదరాసు రాష్ట్రానికి; తక్కిందీ కొచ్చిన్‌కు కేటాయింపబడినాయి.

## రైల్వే ఫెడరేషన్ కార్యవర్గ సమావేశం

### చర్చ వాయిదాకు నిర్ణయం

కలకత్తా, జూలై 21: అఖిల భారత రైల్వే ఫెడరేషన్ కార్యవర్గంవారు నేడిచ్చట సమావేశమై రైల్వే శాఖవారికిని, ఫెడరేషను కార్యదర్శికిని మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాల విషయమై దాదాపు 8 గంటలు చర్చించారు. జయప్రకాశ్ నారు అధ్యక్షత వహించారు. అనుకున్నట్లు ఆగస్టు 27 తేదీన సమ్మె ప్రారంభించవలెనా లేక పనివారి కోర్కెల పరిష్కారానికి యితర మార్గాలు అన్వేషించవలెనా? అనే విషయాలపై సభవారు తుది నిర్ణయం చేయలేదు. సమ్మెను గూర్చియు, వివిధ రైల్వేలలో పరిస్థితులను గూర్చియు చర్చించుటానికి కార్యవర్గంవారు నేటి రాత్రి మరల సమావేశమవుతారు. రైల్వే శాఖ ప్రతినిధుల ప్రకటనల విషయమై కూడ సభవారు చర్చించారు. అంతర్జాతీయ రవాణా కార్మికుల ఫెడరేషను ప్రతినిధి ఎఫ్. పోర్సు, పర్యవేక్షకుడుగా సభకు హాజరైనాడు.

### రైల్వే మంత్రి ప్రకటనకు గిరిగారి హర్షం

మద్రాసు, జూలై 21: రైల్వే పనివారి తగాదా శాంతియుత పరిష్కారానికి పునః రాయబారాలు ప్రారంభించాల్సిందని రైల్వేమంత్రి రైల్వే పనివారి ఫెడరేషను కార్యదర్శిని ఆహ్వానించి నందులకు ఆ ఫెడరేషను మాజీ అధ్యక్షుడు శ్రీ వి. వి. గిరిగారు సంతోషం వెలిబుచ్చారు. ఫెడరేషను ప్రతినిధులు త్వరలో మంత్రిని కలిసి కొని, అన్ని విషయాలలోను నిర్మాణాత్మకమగు సూచనలుచేసి, అన్ని తగాదాల పరిష్కారానికి త్రికరణ శుద్ధిగా కృషిచేయాలని శ్రీ గిరిగారు కోరుతున్నారు.

### సుప్రీంకోర్టు దరఖాస్తు చేస్తారన్నమాట నిజంకాదు

కలకత్తా, జూలై 21: రైల్వేయున్న గు ప్రధాన సర్వీసులలో సమ్మెలను నిషేధించు ఆర్డినెన్సు చెల్లదని సుప్రీమ్ కోర్టుకు దరఖాస్తుపెట్ట ఫెడరేషను సంకల్పించు చున్నదనువార్త సత్యం కాదని రైల్వే పనివారి ఫెడరేషను కార్యదర్శి శ్రీ గురుస్వామిగారు నేడు ప్రకటించారు. ఫెడరేషను కార్యవర్గ సభ్యులెవ్వరూ యిట్టిసూచన చేయలేదని ఆయన తెలిపాడు.

### జయప్రకాశ్, నెహ్రూలమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు

కలకత్తా, జూలై 21: రైల్వే పనివారి సమ్మె విషయంలో అఖిలభారత రైల్వేపనివారి సమాఖ్య అధ్యక్షుడు శ్రీజయప్రకాశ్ నారాయణ్, ప్రధాని పండిట్ నెహ్రూలమధ్య మరికొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచినట్లు తెలుస్తున్నది. శ్రీజయప్రకాశ్ వ్యక్తిగతంగా పంపిన ఒక లేఖకు పండిత నెహ్రూ సమాధానం ఇచ్చారట. పండిత నెహ్రూ సమాధానం ఈరోజున పాట్నా చేరినదనీ, దానిలోని విషయాలను టెలిఫోన్ ద్వారా శ్రీ జయప్రకాశ్‌కు తెలియపరచడం జరిగినదనీ తెలుస్తున్నది. రైల్వేపనివారితో ఏర్పడిన తగాదా పరిష్కార ప్రయత్నంలో ప్రధాని కొన్ని ప్రతిపాదనలు చేశారట. ఏదైనా అ. భా. రైల్వే పనివారి సమాఖ్య కార్యనిర్వాహక వర్గం తీసుకోవలసిన నిర్ణయాన్ని పండిత నెహ్రూ లేఖమార్చి వేయలేదని ఆసమాఖ్య ప్రతినిధి ఒకరు చెప్పారు.

### భారత కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం

నాగపూరు, జూలై 21: మధ్య ప్రదేశ్ కమ్యూనిస్టుపార్టీ ఈ రోజున భారత కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల ప్రణాళికను, కార్యక్రమాన్ని, పార్టీ విధానాన్ని వివరిస్తూ జరిగిన ప్రకటనను ఆమోదించినది. మధ్యప్రదేశ్ కమ్యూనిస్టుపార్టీ ఇక్కడ అయిదు రోజులపాటు సమావేశం జరిపినది. రాబోయే ఎన్నికలలో పాల్గొనడానికి ఇతర పక్షాలతో కలసి సంయుక్తంగా కాంగ్రెసును ప్రతిఘటించడానికి కూడా ఈ పార్టీ నిశ్చయించినది. ఎన్నికల నిర్వహణకై 7 మంది సభ్యులతో ఒక ఎన్నికలసంఘం నియమించడం కూడా జరిగినది. ఈ పార్టీ మహాసభ సెప్టెంబరు నెలలో జరుగుతుంది.

## కిద్వాయ్ జైనుల మంత్రిపదవులు

(1-వ పేజీ తరువాయి)

మా మంత్రిపదవులకు రాజీనామా యివ్వవలసిన అగత్యం ఏర్పడింది. కాని, కాంగ్రెసు సభ్యత్వానికి మేము రాజీనామానిచ్చినప్పటికీ మంత్రిపదవులలో మేము ఉండవలసినదే యని ప్రధానమంత్రి మమ్ములను కోరినారు. దేశనాయకుడైనట్టి వారి సలహాను మేము చులకనగా త్రోసివేయజాలము. దేశము కష్టపరిస్థితిలో ఉండగా, విషమసమస్యలు అనేకము ఇంకా ఎదుర్కొనుచుండగా, యిటువంటి సమయంలో ఆయన మాటను త్రోసివేయజాలము. బాహ్యశక్తి ప్రభుత్వ వ్యవహారదర్శకానములను ఆమోదించుచున్న యిటువంటి సమయమున ... మేము ఆయన సలహాను అనుసరించి మంత్రిపదవులలో ఉండి పని చేయుటకు అంగీకరించితిమి.

## జపాన్ శాంతి సంధి

### సెప్టెంబరు 4-న శాన్‌ఫ్రాన్సిస్కోలో 50రాజ్యాల సమావేశం: అమెరికా బ్రిటనుల ఆహ్వానాలు

వాషింగ్టన్, జూలై 20: సెప్టెంబరు 4 న శాన్‌ఫ్రాన్సిస్కోలో జరుగు జపానీస్ శాంతిసంధి సభలో పాల్గొనవలసినదని అమెరికన్ ప్రభుత్వము 50 దేశాలవారికి ఆహ్వానాలు పంపింది. ఆహ్వానింపబడిన దేశాలలో సోవియటు రష్యాకూడ కలదని విదేశాంగశాఖ ప్రకటన తెలిపింది. అమెరికా బ్రిటిష్ ప్రభుత్వాలు రెండూ సమష్టిగా ఈ ఆహ్వానాలను పంపినవి. ఈ ఆహ్వానంతోబాటు శాన్‌ఫ్రాన్సిస్కో సభలో చర్చకు ప్రాతిపదికగా వుండే సంధి పత్ర ముసాయిదా ప్రతికూడ పంపబడింది. ఈ ముసాయిదాను సభవారు చర్చించి కచ్చితమైన సంధిపత్రాన్ని తయారుచేస్తారు. జపానుతో యుద్ధం చేసిన అన్ని మిత్రరాజ్యాల దృక్పథాన్నీ ఈ సంధి ముసాయిదా సమన్వయం చేస్తున్నదని తాము నమ్ముతున్నట్లు అమెరికన్ విదేశాంగ శాఖవారు తమ ప్రకటనలో చెప్పుతున్నారు.

చైనాకు ఆహ్వానం పంపలేదు. సంధి పత్రంలో కమ్యూనిస్టు చైనా సంతకం చేయవలెనా? లేక జాతీయ చైనా సంతకం చేయవలెనా? అనేవిషయం జపానుకు వదలి వేయబడింది.

సవరింపబడిన సంధిపత్రం ముసాయిదాను ఆగస్టు 13 న పంచిపెడతారని బ్రిటన్ అమెరికాలు తెలిపినవి. జూలై ప్రారంభమున పంచిపెట్టిన సంధి ముసాయిదాపై వివిధ ప్రభుత్వాలు చేసి విమర్శలనుబట్టి దానిని మార్చి ఆగస్టు 13 న 50 దేశాలవారికి పంచిపెట్టుతారు.

### ఫిలిప్పీన్లకు పరిహారం

శాంతిసంధి ద్వారా ఫిలిప్పయిన్లకు జపానునుండి పరిహారం ముట్టే అవకాశం వున్నది. జూలై 12 న వెలువడిన సంధిపత్రమునందలి పరిహార సూత్రము విషయమై ఫిలిప్పయిన్లలో అపోహలు ప్రబలినవి. అమెరికా ప్రభుత్వంవారు పరిహారాలకు యింకా ప్రతికూలంగా వున్నప్పటికీ వాటి విషయమై తమ వైఖరిని పూర్తిగా మార్చుకొన్నారని ఫిలిప్పయిన్లకు తెలుపబడింది" అని అమెరికను విదేశాంగ శాఖవారు చెప్పారు.

నష్టపరిహారం కోశే మిత్రరాజ్యాలన్నిటితోను జపాను రాయబారాలు జరిపి జపాను ప్రజల నైపుణ్యమును, పరిశ్రమను వారికి లభ్యంచేయాలని సంధి ముసాయిదా చెప్పుతున్నది.

### జపాన్‌కు ఆహ్వానం

టోకియో, జూలై 21: టోకియోలోని అమెరికన్ రాయబారి విలియమ్ సేబాల్డ్ ఈ రోజున జపాన్ ప్రధాన మంత్రి షిగేరు యోషిదాను కలుసుకుని, సెప్టెంబరు 4 వ తేదినుండి శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగే శాంతి సమావేశంలో పాల్గొనవలసిందని జపాన్‌ను అధికారరీత్యా ఆహ్వానించారు.

### ఫ్రాన్సు కోర్కెలు

ప్యారిస్, జూలై 20: సెప్టెంబరు 4 తేదీన జరుగు జపానీస్ సంధి సభలో సంతకం చేయడానికి ఇండోనీషియా సంయుక్త రాష్ట్రాలనుగూడ (వియత్నాం, కాంబోడియా, లావోస్) ఆహ్వానించాలని ఫ్రాన్సు అమెరికాలు కోరింది. మిత్రమండలి దూరప్రాచ్య కమిషను భవిష్యత్తు విషయమై అమెరికా తన భావాలను స్పష్టీకరించాలని, తనకు కొన్ని ఆర్థిక సౌకర్యాలు కావలెనని, పరిహార మివ్వడానికి జపానుకు కల బాధ్యతను సంధి పత్రంలో మరింత స్పష్టంగా నిర్వచించాలని ఫ్రాన్సు కోరింది. మొత్తంమీద సంధి పత్రము ఫ్రాన్సు అభిప్రాయాలకు అనుగుణంగా నున్నదని తెలుస్తున్నది.

ఇండో-చైనా సంయుక్త రాష్ట్రాలను శాంతిసభకు ఆహ్వానించ అమెరికా సుముఖముగా నే వున్ననిగాని ఆ దేశాన్ని చేర్చే యెడల కొంతమంది ఆసియా రాజ్యాలవారికి కోపం వచ్చునను తలంపుతో ఆహ్వానం పంపలేదని వాషింగ్టన్ వార్త తెలుపుచున్నది. ఆగ్నేయ ఆసియా దేశాలలో చాలాభాగం ఈ రాజ్యం గుర్తింపును ఉపసంహరించుకొన్నాయి.

### రష్యాకు ఆహ్వానం

మాస్కో, జూలై 20: మాస్కోయందలి అమెరికన్ బ్రిటిషు రాయబారులు నేడు సోవియట్ విదేశాంగ శాఖ ఉపమంత్రి గ్రోమికోకు ఒక పత్రము, జపాన్ శాంతిసంధి ముసాయిదా అందజేశారు. ఆగస్టు 13 తేదీలోపుగా సంధిపత్రం ముసాయిదాపై సోవియటు ప్రభుత్వంవారి అభిప్రాయం అందజేయాలని, శాన్‌ఫ్రాన్సిస్కో సభకు హాజరు కావాలని బ్రిటిషు అమెరికను రాయబారులు అందజేసిన పత్రం కోరుతున్నది. బ్రిటిషు అమెరికన్ రాయబారులు గ్రోమికోతో 15 నిమిషములు మాట్లాడి వెళ్ళిపోయారు.

### విజయవాడ పట్టణ కాంగ్రెసు

విజయవాడ, జూలై 21: ఈపట్టణ కాంగ్రెసు సంఘసమావేశం ఈసాయంకాలం అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతన జరిగినది. ఇ వల బెంగుళూరులో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘసమావేశ నిర్ణయాలను గురించి కాళేశ్వరరావుగారు సభ్యులకు తెలియపరిచారు.

## అబ్దుల్లారాజు హత్య: సంతాప పరంపర

### జోర్డన్ రీజంటుకు అధ్యక్షుని సానుభూతి సందేశం

న్యూఢిల్లీ, జూలై 21: నిన్న హంతకుని తుపాకికి బలియైన జోర్డన్ రాజు అబ్దుల్లా యెడల గౌరవసూచకంగా నేడు ప్రభుత్వ భవనముపైనను, ఢిల్లీ యందలి ఇతర ప్రభుత్వ భవనాలపైనను పతాకలు సగమువరకు క్రిందికి దించబడినవి. భారత రిపబ్లిక్ అధ్యక్షులు ఒక సంతాప సందేశాన్ని జోర్డన్ రీజంటుకు పంపియున్నారు. 'జోర్డన్ మహానాయకుడగు అబ్దుల్లా రాజు ఘోర హత్య నాకు అపరిమితమైన సంతాపం కలిగించింది; నా యొక్కయు, నా ప్రభుత్వము యొక్కయు, భారతప్రజల యొక్కయు హృదయపూర్వక సానుభూతిని దయయుంచి అంగీకరించాల్సింది' అని ఈ సందేశంలో అధ్యక్షుడు చెప్పుచున్నారు.

### ట్రూమన్ సందేశం

వాషింగ్టన్, జూలై 20: అధ్యక్షుడు ట్రూమన్, అమెరికా విదేశాంగ మంత్రి డీన్ అచిసన్ అమ్మానుకు ఈవేళ సానుభూతి సందేశాలు పంపారు. ట్రూమన్ యువరాజుకు ఈ క్రిందివిధంగా సందేశం పంపాడు:- మీ తండ్రిగారు అబ్దుల్లా దుర్మరణానికి గురి అయినారని విని నేను చాలా దుఃఖించాను. అరబ్ రాజ్యాల సహాయకులలో ఒకడుగా ఆయన చిరకాలం స్మరించబడతాడు. ఈఆపత్సమయంలో మీకు నాహృదయ పూర్వకమైన సానుభూతి అందజేయగోరుతున్నాను.

### ఈజిప్టు విదేశాంగ మంత్రి

అలెగ్జాండ్రియా, జూలై 20: మధ్య ప్రాచ్యంలో జరుగుతున్న రాజకీయ హత్యలకు విచారం వెలిబుచ్చుతూ, ఈజిప్టు విదేశాంగమంత్రి ఈ వేళ ఒక ప్రకటన చేశాడు.

ఇరాక్ ఎమరూ, లండన్‌లోని జోర్డాన్ ప్రతినిధి రేపు అమ్మాన్‌కు వెళ్తారు.

### సిరియాప్రధాని సంతాపం

డెమాస్కస్, జూలై 21: "అరబ్ దేశాల స్వాతంత్ర్యంకోసం తన తండ్రిగారి ఆధ్వర్యాన అబ్దుల్లా రాజు సాగించిన జిహాద్‌ను అరబ్ దేశాలేవీ విస్మరించలేవు. అరబ్ దేశాల అధిపతులు ఇలా వరసవరసగా రాజకీయహత్యలకు గురికావటం చాలా శోచనీయం." అని సిరియా ప్రధానమంత్రి ఖలెద్ అజెమ్ ప్రకటించాడు. సిరియా అధ్యక్షుడు, సిరియా ప్రధాన మంత్రి అమ్మాన్‌కు నిన్న రాత్రి సంతాప సందేశాలు పంపారు. సిరియాలో 3 రోజులు సంతాపదినాలుగా పరిగణించబడతాయని తెలుస్తున్నది.

### మధ్యప్రాచ్యంలో బ్రిటన్ ప్రాభవం క్షీణించిపోతోంది

న్యూయార్కు, జూలై 21: అబ్దుల్లా రాజు పోవడంతో మధ్యప్రాచ్యంలో బ్రిటన్ ప్రాభవం క్షీణించి పోగలదని న్యూయార్కు టైమ్సు న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూను ఈ వేళ భయాందోళనలు వెల్లడించాయి.

వారసత్వం విషయమై కూడా తగాదావచ్చేటట్లు వుండడం చేత పరిస్థితి మరింత కుటిలంగా పరిణమించగలదనీ, పెట్రోలు గనుల విషయమై ఇరాక్‌కు బ్రిటన్‌కూ ఏర్పడిన తగాదా కూడా విషమంలో పడవచ్చునని అవి వ్రాశాయి.

### అమెరికా

వాషింగ్టన్, జూలై 20: కొంత కాలంగా సిరియా లెబనాన్‌లకు విద్వేషాలు ప్రబలి ఉన్నాయనీ, అట్లాగే, సాదీ అరేబియాలో జోర్డాన్ ఇరాకుల సంబంధాలుకూడా విషమించి వున్నాయనీ తెలుస్తున్నది. ఇప్పుడీ హత్యవల్ల ఈ విద్వేషాలు ఇంకా ఎంతదూరం పోతాయో అని యిక్కడి వారు భయపడుతున్నారు. మధ్య ప్రాచ్య పరిస్థితిలో దీనివల్ల కలుగగల పరిణామాలను అమెరికా ప్రభుత్వం జాగ్రత్తగా పరిశీలిస్తున్నదని విదేశాంగశాఖ ప్రతినిధి ఒకరు ప్రకటించారు.

### ఫ్రాన్సు

మధ్య ప్రాచ్యంలో ఈ దారుణ సంఘటనవల్ల తీవ్ర విపర్యాసాలు రాగలవని ఫ్రెంచి ప్రభుత్వం ఆశంకిస్తున్నదనీ, ఇట్టి అత్యాచారం జరిగినందుకు ఫ్రెంచి ప్రభుత్వం చాలా ఖేదపడుతున్నదనీ, ఫ్రెంచి విదేశాంగ కార్యాలయోద్యోగి ఒకడు వ్యాఖ్యానించాడు.

ఈదుస్సంఘటనవల్ల ఎట్టి దారుణ పరిణామాలు కలుగనున్నాయో ఊహించడానికే తమకు భయంవేస్తున్నదని, దీనివల్ల అంతర్జాతీయంగా చాలా విషమ పరిస్థితులు ఏర్పడగలవని అబ్దుల్లా రాజు సన్నిహిత మిత్రులలో ఒకడున్నూ జోర్డాన్ మాజీ విదేశాంగ మంత్రియున్నూ అయిన ఫాజాపాషా అన్నారు. పాలస్తీనాలు అయినదానికీ కాదనడానికీ ప్రతిఘటిస్తున్నందువల్ల నే దానిని అబ్దుల్లారాజు రద్దుచేయటం జరి...

## ప్రకాశంగారి విగ్రహ ఆవిష్కరణవాయిదా

### కిద్వాయిగారిరాక ఆలస్యం

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

విజయవాడ, జూలై 22: నేటి సాయంకాలం ఇక్కడ జరుగవలసి వున్న శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి కంచువిగ్రహ ఆవిష్కరణోత్సవం రేపటికి వాయిదా పడినది.

ఆవిష్కరణోత్సవం జరిపడానికి నేటి అపరాహ్ణం ఇక్కడికి రావలసి వున్న కేంద్ర రహదారి సౌకర్యాల శాఖమంత్రి రఫీ అహమ్మదు కిద్వాయి వాతావరణ పరిస్థితి ప్రతికూలంగా వున్న కారణంచేత విమానంలో నాగపూరు తిరిగి వెళ్ళారు. ఆవిష్కరణోత్సవం రేపుసాయంకాలంజరుగుతుంది. రఫీఅహ్మద్ కిద్వాయ్ రేపు ఉదయం ఇక్కడికి చేరుకుంటారు.

గుంటూరులో రేపు ప్రజా పార్టీ సమావేశం జరుగుతుంది. డాక్టర్ పి. సి. ఘోష్ రేపుఉదయం గుంటూరుకు వెళ్ళి సాయంకాలానికి ఇక్కడికి తిరిగివస్తారు. కంచువిగ్రహ ఆవిష్కరణోత్సవానికి ఆయన అధ్యక్షత వహిస్తారు.

## పశ్చిమనేపాల్‌లో ఇండియా సేనల ప్రసక్తి

### లియాకతాలీ వ్యాఖ్యపై నేపాల్‌ప్రభుత్వ విమర్శ

ఖట్మండు, జూలై 21: ఇండియా నేపాల్ దేశాల సైన్యాలు సంయుక్తంగా పశ్చిమ నేపాల్‌లో ప్రస్తుతం జరుపుతున్న సైనికచర్యలపై పాకిస్తాను ప్రధాని లియాకత్ అలీఖాన్ చేసిన వ్యాఖ్యపట్ల నేపాల్ విదేశాంగ కార్యాలయ ప్రతినిధి ఒకరు యీ రోజున ఆశ్చర్యం వెలిబుచ్చారు.

భారతప్రధాని పండిత నెహ్రూకు పంపిన తంత్రీలేఖలో లియాకత్ అలీ ఖాన్ "డాక్టర్ కె. ఐ. సింగు అనుయాయులు పశ్చిమ నేపాల్‌లో లేవదీసిన విప్లవం" గురించి ప్రస్తావించారంటూ పాకిస్తాన్ రేడియో ప్రకటించినది. లియాకత్ అలీ సందేశం పూర్తి పాఠం చేతవరకూ దానిపై సవివరంగా వ్యాఖ్యానించడానికి వీలు లేదంటూ ఆ ప్రతినిధి ఇలా చెప్పారు: "నేపాల్ ప్రభుత్వ అభ్యర్థనపై ఇండియా సైన్యాలు పశ్చిమ నేపాల్‌లోని విధ్వంసకారులను అణచివేయడానికి గాను నేపాల్ సైన్యాలతో కలిసి సంయుక్తంగా చర్యలు జరుపుతున్నవి. ఈ సహాయానికి మేము కృతజ్ఞులము. నేపాల్‌లో ఎట్టి రాజకీయమార్పులు వచ్చినప్పటికీ అనాదిగా యీ వుభయ దేశాలమధ్యవున్న సన్నిహిత స్నేహ సంబంధాలు మాత్రం మార్పు చెందవు."

నేపాల్ పై అసత్యప్రచారం చేయడానికి లియాకత్ అలీ చేస్తున్న ప్రయత్నాలను నేపాల్ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కృష్ణప్రసాద్ ఉపాధ్యాయ ఖండించారు.

## కంపెనీల అధిపత్యం మార్పుకు అనుమతి

### భారతప్రభుత్వ ఆర్డినెన్సు

న్యూఢిల్లీ, జూలై 21: భారతకంపెనీల చట్టాన్ని సవరించే ఆర్డినెన్సు నొకదానిని రిపబ్లిక్ అధ్యక్షులు నేడు జారీచేశారు. ఈ ఆర్డినెన్సునుసరించి కంపెనీల కంట్రోలును ఒకరినుండి మరియొకరికి మార్చదలచే యెడల భారత ప్రభుత్వంవారి అంగీకారం పొందాలి. బాగాస్థిరపడినట్టి, కీర్తి ప్రతిష్ఠలు సంపాదించినట్టి జాయింట్ స్టాక్ కంపెనీలు స్వార్థపరుల చేతుల్లో, ఆ కంపెనీలకూ, పెట్టుబడిదార్లకూ నష్టంకలిగించేవారి చేతుల్లో పడకుండా చేయడమే యీ ఆర్డినెన్సు ఉద్దేశ్యమని ఆర్థికశాఖవారు నేటి రాత్రి ప్రకటించారు.

### శ్రీ సి. రాజగోపాలాచారిగారు

ఇండియా ప్రభుత్వ హోంమంత్రి శ్రీసి. రాజగోపాలాచారిగారు 22 న ఉదయం ఢిల్లీ వెళ్లారు.

## బరంపురం మునిసిపల్ ఎన్నికలు

### నామినేషన్లు దాఖలుచేయ నిరాకరణ

బరంపురం, జూలై 21: నిన్న బహిరంగసభలో చేయబడిన తీర్మానం ప్రకారం, యీ పురపాలకసంఘానికి జరిగే ఎన్నికలకు ఎవరూ నామినేషన్లు దాఖలు చేయలేదు. న్యాయవాది సుబ్బారావు, దివాకర్ పట్నాయక్ శరశ్చంద్రమహాపాత్రో ప్రభృతినాయకులు, పురపాలక సంఘ కార్యాలయ ఆవరణలోవుండి ఎన్నికలలో పాల్గొనదలచిన అభ్యర్థులు నామినేషన్లను దాఖలుచేయకుండా నివారించుటలో కృతకృత్యులైనారు. అయితేంప్తై తిరువాతి యీ పురపాలకసంఘాని కిప్పుడు ఎన్నికలు నిశ్చయింపబడినాయి. పురపాలకసంఘంలో మొత్తం స్థానాలు28.

గించిన, కొత్త పార్లమెంటుకు ఆగస్టు 29 వ తేదీన ఎన్నికలు జరుగనున్నాయనీ, ఆయన ఢిల్లీకి తెచ్చారు.

## పాకిస్తాన్ సైన్యవిన్యాసాలలో అకిన్‌లెక్ పాత్ర

### నెహ్రూ ప్రకటనపట్ల బ్రిటన్ ఆందోళన

న్యూఢిల్లీ, జూలై 21: పాకిస్తాన్‌లో తిరుగుతున్న మాజీ బ్రిటిష్ ఉద్యోగులను గూర్చి నెహ్రూ అన్న మాటలు, ఇండియాలో బ్రిటిషువారిపట్ల పెరుగుతున్న ఏహ్యభావం, బ్రిటిష్ ప్రభుత్వాన్ని చీకాకు పరుస్తున్నట్లు ఇప్పటికు చేరిన వార్తలవల్ల తెలుస్తున్నది.

ఈ అవసరంలో ఫీల్డు-మార్షల్ అకిన్‌లెక్ నేపను, నేపను, పాకిస్తానుకు రావడం, సైనిక కేంద్రాలను పరిశీలిస్తూ వుండటం, సైన్య విన్యాసాలలో పాల్గొంటూ వుండటం ముఖ్యముగా గమనించవలసివుంది. ఇండియా విభజనకు పూర్వం ఈ ఫీల్డు మార్షల్ అకిన్‌లెక్ భారత సర్వసేనానిగా వుండేవాడు. అదీకాక, ఇండియా పాకిస్తాన్ సైన్యాలను ఒకే సేనాని క్రింద వుంచరాదని, ఆ కాలంలో ఇండియా పట్టు పట్టడానికి కారణం. ఇటువంటి బ్రిటిష్ సైనికోద్యోగులు దేశవిభజన సమయంలోను, ఆ అనంతరం జరిగిన మతకలహాలలోను తోడ్పడ చేసిన ప్రవర్తనలే అని గూడా ఇప్పుడు తెలుసుకోవలసి వున్నది.

వాలే ఇక ఈ అకిన్‌లెక్ ఈ సంవత్సరం మార్చిలో ఒకసారి పాకిస్తానుకు వచ్చి, తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌లలో పర్యటించారు. ఆయన వచ్చినప్పుడు డాన్‌పత్రిక అకిన్‌లెక్ పాకిస్తాన్‌లో 6 వారాలపాటు మాత్రమే వుంటారని వ్రాసిందిగాని, ఆయనవచ్చి యిప్పటికి 12 వారాలైనా, వెళ్ళలేదు. సరికదా, ఇంకా కరాచీలో మకాం వేసుకు కూర్చున్నట్లు తెలుస్తున్నది.

పశ్చిమ పాకిస్తాన్‌లో వుండగా అకిన్‌లెక్ లాహోరు, జీలం, రావల్ పిండి, మొదలైన సైనిక కేంద్రాలను దర్శించారు. మే నెలలో పాకిస్తాన్ ప్రధానిని కలుసుకొన్నారు. పాకిస్తాన్ సైన్యాధిపతి జనరల్ మహ్మద్ అయూబ్ ఖాన్ విడిదిలో మకాం వేశారు. క్వెట్టా మిలిటరీ కళాశాలలో జరిగిన సమాలోచనలలో ప్రముఖంగా పాల్గొనటమేకాక, కాశ్మీర్ సమీపాన వున్న ప్రాంతం మీద జరగవలసిన దాడులు ఎట్లా వుండాలో తెలిపే, సైనికవిన్యాసాలలో పాల్గొన్నారు. ఆ తర్వాత అకిన్‌లెక్ తూర్పు పాకిస్తాన్ వెళ్లారు.

1951 జూన్ 19 వ తేదీనాడు డాన్ పత్రిక ఢక్కా విలేఖరి అచ్చట అకిన్‌లెక్ కార్యకలాపాలను గూర్చి తన పత్రికకు పంపిన వార్త ఈవిధంగా వుంది. "ఫీల్డుమార్షల్ అకిన్‌లెక్' మేజర్ జనరల్ షెరలీఖాన్ (పాకిస్తాన్ సైన్యం అడ్జటెంట్ జనరల్) గురువారంనాడు విమానంలో కోమిల్లాకు పోయి, అచ్చట మిలిటరీ ఆస్పత్రిని చూచి, అనంతరం మియన్‌మతీకి వెళ్లి, అచ్చట సైనిక కేంద్రాలను పరిశీలించి వచ్చారు." ఈవార్త జూన్ 19 నాటిదే అయిన, అప్పటికే అకిన్‌లెక్ ఢక్కా చేరుకొని 10 రోజులుపైన అయింది. జూన్ 8 న అకిన్‌లెక్ ఢక్కా వచ్చాడు. గవర్నర్ ఇంటిలో మకాం వేశాడు.

ఇదే కాలంలో జనరల్ గ్రేసీ గూడా కరాచీ వచ్చారు. గ్రేసీ పూర్వం పాకిస్తాన్ సర్వసేనానిఅయన గూడా పాకిస్థాన్ సైనికోద్యోగులతో సమాలోచనలు జరుపుతూ, సైనిక కేంద్రాలను దర్శిస్తూ కాలం గడుపుతున్నారు.

అదీకాక కాశ్మీర్ సమస్య అంటూ తలఎత్తిన దగ్గరనుంచీ, బ్రిటిష్ ఉద్యోగులు గాని, బ్రిటిషు ప్రభుత్వంగాని, బ్రిటిషు పత్రికలు గాని, ఇండియాను అర్థం చేసుకుందామని ప్రయత్నించిన పాపాన పోలేదు. ఇందుకు కారణం ఏమై వుంటుంది. అని ఆలోచిస్తే, బ్రిటన్ ఇండియా విభజన అనంతరం కాశ్మీరును పాకిస్తానుకు ఇస్తానని వాగ్దానమున్న చేసివుండాలి, లేదా కాశ్మీర్ పాకిస్థాన్‌కు కట్టపెట్టడం మంచిది అని భావిస్తూ వుండాలి అని అనిపిస్తుంది.

దేశవిభజనకు పూర్వమే బ్రిటిష్ ప్రభుత్వం గిల్గిత్ మొదలైన ప్రాంతాలు కాశ్మీర్ ప్రభుత్వం ఆధీనంలోకి పోతాయి. అని ప్రకటించి నప్పుడు, అచ్చటవున్న బ్రిటిష్ ఉద్యోగులు ఈ నిర్ణయం ఎంతమాత్రం నచ్చలేదు. ఆ నచ్చక పోవడంతో ఆగక, తామే పాకిస్తాన్ ప్రతినిధులైనట్లు వర్తించి, ముస్లింలుకాని ఉద్యోగులను, కాశ్మీర్ ఉద్యోగులను తొలగించి, అచ్చట పాకిస్తాన్ పతాకాన్ని ఎగురవేశారు. ఆతర్వాత మేజర్ జనరల్ బ్రౌన్ స్వయంగా పాకిస్తాన్ ప్రభుత్వాన్ని ఆహ్వానించి, గిల్గిత్ ప్రాంతాన్ని వారి చేతుల్లో పెట్టాడు. అప్పుడు కాశ్మీర్‌లో స్టాఫ్ ఆఫీసరుగా మేజర్ జనరల్ స్కాట్ వుండేవాడు. ఆయనకూడా ఈ ఉదంతం జరిగినప్పుడు గిల్గిత్‌లో వున్నాడు. బ్రిగేడియర్ జనరల్ ఘన్‌సారా సింగ్ తోపాటు ఆయన అచ్చటకు వెళ్లాడు. బ్రిగేడియర్ జనరల్ ఘన్‌సారా సింగ్ అప్పుడు గిల్గిత్ గవర్నర్‌గా నియమితుడైనాడు. ఆతర్వాత ఆ సేక ... ఉద్యోగంలోంచి తొలగించడం జరిగింది.

కాశ్మీర్‌మీద కొండజాతి మూకలు పాకిస్తాన్ నుంచి వచ్చిపడ్డప్పుడు కాశ్మీరులో ఎంత సైన్యం వుందో, ఎవ్వరిచ్చట వుందో ఎవరికి తెలియదు. బ్రిగేడియర్ రాజేంద్రసింగు ఈ మూకను ఎదుర్కొడానికి పోయినప్పుడు 150 మంది సైనికులు మాత్రం ఆయన వెంట వున్నారు.

దేశ విభజన జరుగుతున్నప్పుడు ఒక విషయం ప్రచారంలో వుండేది. ఇండియాను జయించడానికి విభజనకు పూర్వమే మేజర్ జనరల్ షహీద్ అహమ్మద్ ఒక పథకాన్ని వేసి వుంచారన్నది ఈ ప్రచారం యొక్క సారాంశం. ఈ మేజర్ జనరలు, అచిన్‌లెక్ స్వంత కార్యదర్శిగా పనిచేస్తూ వుండేవాడు.

ఇక పోతే, విభజన పూర్తి అయిన వెంటనే సర్ డాగ్లస్ కన్నింగ్‌హాం (సరిహద్దు రాష్ట్ర గవర్నరు) భారత సైన్యం సేనాని సర్ రాబర్ట్ లాక్‌హార్ట్‌కు కొండజాతులను కాశ్మీర్ మీద దాడికి సన్నాహ పరుస్తున్న సమాచారాన్ని ఉత్తరంగా వ్రాసి పంపారు. కాని ఆ ఉత్తరం ఎవరి కళ్ళకు పడకుండా వుంటూ వచ్చింది. ఆఖరికి కాశ్మీర్‌లో యుద్ధం పతాకస్థాయిలో ఉన్నప్పుడు జనరల్ బుచ్చర్ దీనిని భారత ప్రభుత్వం దృష్టికి తెచ్చారు.

ఆ తర్వాత కాశ్మీర్ యుద్ధాన్ని గూర్చి జనరల్ గ్రేసీ చేసిన ప్రకటన బయటపడింది. "భారతసైన్యానికి పైన పేర్కొన్న ఏ ప్రాంతంలో విజయం లభించినా, అందులోనూ ముఖ్యంగా ముజఫరాబాద్ ప్రాంతంలో లభిస్తే, కొండజాతి జనం పాకిస్తాన్‌కు ఎదురు తిరుగుతుంది. ఎందుచేతనంటే, పాకిస్తాన్ వారికి చేస్తానన్న సహాయాన్ని నూటికి నూరుపాళ్ళు చేయలేకపోయింది. అందుచేత వారి కోపంఅంతా పాకిస్తాన్ మీదకు తిరగవచ్చు." అని గ్రేసీ ఈ ప్రకటనలో అన్నాడు. ఈప్రకటన పాఠాన్నే, సర్ బి. ఎన్. రావు భద్రతాసంఘంలో చదివినప్పుడు, ప్రపంచం అంతా ఒక్కసారి విస్తుపోయింది.

వీటి అన్నింటికీ తోడు ఒక్క సంవత్సరంగా పాకిస్తాన్‌లో ఇండియా మీద యుద్ధానికి ప్రజలను పురికొల్పడం జరుగుతున్నది. పవిత్రం యుద్ధం పేరుతో యుద్ధప్రచారం కొనసాగుతున్నది. విమానదాడి రక్షణాలు అన్ని పట్టణాలలోను ఏర్పాటు చేయబడుతున్నాయి. సైనికులకు ఉద్యోగులకు సెలవులు రద్దుచేయబడినాయి. జీతాలు హెచ్చాయి. ఆయుధాల బలం నానాటికి ఎక్కువ చేయబడుతున్నది. ఇండియా శక్తి ఏమిటో పాకిస్తాన్‌కు తెలియని విషయం కాదు. అయినా ఈ ఏర్పాట్లు అన్నీ కొనసాగుతూనే వున్నాయి. ప్రజల మనస్సులు యుద్ధానికి ఉన్ముఖాలు చేయబడుతూనే వున్నాయి. పాకిస్తానులో ఇంతతతంగం జరుగుతూ వున్నప్పుడు ఎవరన్నా ఏమనుకోవలసి వుంటుంది? ఇందుకు ఈ రెండింటింలో ఏదో ఒకటే ప్రత్యుత్తరం (1) అంతరంగిక రాజకీయ విషయాలపట్ల ప్రజలకు కలిగే ఆశక్తిని మళ్లించడానికి ఆడే నాటకమున్నా అయివుండాలి, లేదా (2) ఆటువంటి ఎత్తుగడలకు దిగవలసిందిగా, ఇతర దేశాలు ప్రోద్బల పరిస్తే, ఆ దేశాలకు అనుకూలంగాఇట్టి చర్యలకుదిగిఅన్నా వుండాలి. పాకిస్తాన్ అయితే, ఇండియామీదకు ఏవిధమైనఎత్తికోలుకుదిగాలన్నా, ఒకసారి కాదు. పదిసార్లు ఆలోచించుకొని మరీ దిగవలసి వుంటుంది. ఇక చివరిమాట ఒకటేవుంది. ఈ మధ్య నే బ్రిటిష్ కామన్‌వెల్తు సంబంధాల మంత్రి ఇండియా ఏమనుకున్నా దానితో సంబంధం పెట్టుకోకుండా, పాకిస్తాన్‌తో సైనిక ఒప్పందం చేసుకోవడం తనకు అభిమతమైన విషయం అని పేర్కొని వున్నారు. ఇది గూడా గమనించ దగ్గ విషయమే.

## నారాయణ శిఖరం ఆరోహణ

### స్విస్ బృందంవారి ప్రయత్న విరమణ

నైనిటాల్, జూలై 21: సుప్రసిద్ధ హిందూ క్షేత్రమగు బదరీనాథ్‌కు దాదాపు ఒకరోజు ప్రయాణమగు నారాయణ పర్వతమును ఆరోహించి ఇద్దరు స్విస్ పర్వతారోహకులు నేడు యిక్కడికి తిరిగివచ్చారు. ఈ పర్వతారోహకులు యింకా ఉన్నతమైన శిఖరాలను ఆరోహింప సంకల్పించి యుండిరి. కాని 14,000 అడుగుల యెత్తు దాటిన తరువాతి వాతావరణము సరిగా లేకపోవుటచేత వారు ఆ ప్రయత్నమును విరమించారు. వీరు హిమాలయములలో మూడు మాసములు కాలినడకను పర్యటించారు. తమ సామానులను మోయడానికి వారు కూలివానిని గూడ పెట్టుకోలేదు.

### ఆస్ట్రేలియా విదేశాంగ మంత్రి పర్యటన

కరాచీ, జూలై 21: ఆస్ట్రేలియా విదేశాంగమంత్రి సెనేటర్ గార్డినర్ నేడిక్కడికి వచ్చారు. ఆయన ఇండోనీషియాలో మూడురోజులపాటు పర్యటిస్తారు.

## హైద్రాబాదులో ఆయుధాల పట్టివేత

### స్పెషల్ పోలీసులకృషి ఫలితం

హైదరాబాదు, జూలై 22: హైదరాబాదు నగరంలో తాము సాగించిన అనేక దాడుల్లో ఒకనాడి సందర్భాన హైదరాబాదు స్పెషల్ పోలీసులకు (సి. ఐ. డి.) నిన్న టిదనం వల్లనూలి నన్ని మారణాయుధాలూ, పెద్ద మందుల కొంపలకు సరిపోయ్యే మందుగుండుసామగ్రి పట్టుబడి పోయినట్లు తెలుస్తున్నది. ఆ ఆయుధాల్లో కత్తులూ, కటార్లూ, బాకులూ, బల్లెలూ మొదలైన ఎన్నో రకాలున్నాయి. అందులో కొన్ని 'అవల్ దర్జా' రైఫిల్లు కూడా ఉన్నాయి.

కొంత కమ్యూనిస్టు సారస్వతం కూడా పట్టుబడినట్లు తెలుస్తున్నది.

## మరుగుపడిన భారత ప్రతిభ

### యువకులకు గోపాలరెడ్డిగారి ఉద్బోధ

హైదరాబాదు, జూలై 21: నానావిధ ప్రాచీన విద్యాసంస్కృతులను తెల్ల నేర్చుకొని, వాటిని ఆధునిక భావనాధోరణిలో అవలంబిస్తూ తెచ్చుకొని, మరుగున పడిపోయిన భారతాత్మను మళ్ళీ వెలికి పట్టుకొని వచ్చి ముందున నిలపండి" అని మద్రాసు ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు యువకుల నుద్బోధించారు.

వివేకవర్ధనీ కళాశాలకు సంబంధించిన భారతీయసంస్కృతివిద్యాపీఠం యాజమాన్యాన జరిగిన సభలో రెడ్డిగారు ప్రసంగించారు. "చైనావంటి ఏవో కొన్ని దేశాలు తప్పనిచ్చి మిగతా ప్రపంచమంతా కేవలము అంధకార బంధురమైయున్న సమయంలో భారతదేశం నాగరికత విషయంగా పరాకాష్ఠ నందుకొన్నది" అని రెడ్డిగారన్నారు.

## అనవసరంగా హైద్రాబాద్ ప్రసక్తి

### పాకిస్థాన్ ప్రధానికి బకరాలీ మీర్జా వినతి

హైదరాబాదు, జూలై 21: "హైదరాబాదు విషయాల్లో మరి జోక్యం కలగజేసుకోకండి" అని పార్లమెంటు సభ్యుడు బకరాలీ మీర్జాగారు పాకిస్థాన్ ప్రధాని లియాకతాలీఖాన్ గారిని అర్థించారు.

హైదరాబాదు వ్యవహారాల్లో పాకిస్థాన్ జోక్యం కలిగించుకొన్నందువల్ల తామెంతటి కష్టనిష్ఠూరాలకు గురికావలసివచ్చిందీ హైదరాబాదు ప్రజలకు బాగా ఎరుకేననీ, పాకిస్థాన్ బ్యాంకుల్లో ఇంకా అలానే ఉండిపోయిన ఆ పెద్దపెద్ద మొత్తాల హైదరాబాదు డబ్బు సంగతిని గురించి పాకిస్థాన్ ప్రధాని యేమంటారనీ మీర్జాగారు పత్రికలకు చేసిన ఒక ప్రకటనలో అన్నారు.

### ప్రజాపార్టీ-కమ్యూనిస్టుపార్టీ సమ్మేళనం

హైదరాబాదు, జూలై 21: కె. కేలప్పన్‌గారి నాయకత్వాన నెలకొన్న కేరళ ప్రజాపార్టీయున్ను, కమ్యూనిస్టు పార్టీయున్ను బహుశా వచ్చే జనరల్ ఎన్నికల్లో మలబారువందు సమష్టిగా పోటీ చేస్తాయని కమ్యూనిస్టు నాయకుడు ఎ. కె. గోపాలన్‌గారు ఇవాళ పి. టి. ఐ. విలేఖరితో చెప్పారు.

ఈ విషయమై తనకూ, కేలప్పన్‌గారికీ ఉత్తర ప్రత్యుత్తరాలు నడుస్తున్నాయనీ, ఈ యిరుపక్షాలవారు ఒక ఒడంబడికకు రావడానికి అవకాశం విస్పష్టంగా కనబడుతున్నదనీ ఆయన అన్నారు.

### సాముదాయిక జరిమానా

సికిందరాబాదు, జూలై 21: వికారాబాదు తాలూకా రాంపల్లి గ్రామంపైన హైదరాబాదు ప్రభుత్వంవారు రూ. 7,500 సాముదాయిక జరిమానా వేశారు. ఆ గ్రామ వాస్తవ్యులు శాంతి భద్రతలకు భంగకరమైన పనులు చేసినట్లు అనుమానించి తీసుకొన్న చర్య యిది.

ఇదే కారణంతో మద్దపల్లి గ్రామ గ్రామవాసుల పైనకూడా 5000 రూ.ల సాముదాయిక జరిమానా విధింపబడింది.

### హైదరాబాదులో వానలు

హైదరాబాదు, జూలై 22: నిన్నటినుంచి హైదరాబాదులో జోరున వానలు కురుస్తున్నాయి. ఈ మధ్యాహ్నంవరకే మూడంగుళాల వాన కురిసినట్టు లెక్క తేలింది. ఇంకా ఆకాశం కారుమబ్బులతో నిండే వుంది. మదరాసునుంచి వచ్చిన డక్కన్ ఏర్‌వేస్ వారి విమానం యీ ఉదయం గంటన్నర ఆలస్యంగా వచ్చింది. బెంగుళూరు విమానం సకాలానికే వచ్చింది. ఢిల్లీ బొంబాయి విమానాలు కూడా సకాలానికే వచ్చేటట్లున్నది.

మద్రాసునుంచి ఢిల్లీకి విమానంలో వెళ్లుతూ వెళ్లుతూ మార్గమధ్యాన ఇండియా హోం మంత్రి సి. రాజగోపాలాచార్యులుగారు ఈ ఉదయం ఇక్కడ కొన్నేపు ఆగారు. ముఖ్య మంత్రి మొదలైన వారు ఆయనను విమానాశ్రయంలో స్వాగతమిచ్చారు.

కరాచీ, జూలై 22: విరుదులను యివ్వకుండు నిర్ణయమును పాకిస్థాన్ ప్రభుత్వము నేటిరాత్రి ప్రకటించింది.

## తెలంగాణా కమ్యూనిస్టులతో సమాలోచన

### పరిస్థితిపై చర్చ

హైదరాబాదు, జూలై 21: తెలంగాణా కమ్యూనిస్టులకూ, ప్రభుత్వానికీ రాజీ కుదర్చడం నిమిత్తం కమ్యూనిస్టుపార్టీ కేంద్రసంఘం పనుపున వచ్చిన కమ్యూనిస్టు నాయకులు ముజఫర్ అహమద్, జ్యోతీబసు, ఎ. కె. గోపాలన్‌గార్లు ముగ్గురూ హైదరాబాదు జెయిలులో ఉన్న తమ సహచరులు మక్దూం మొహియుద్దీన్, రావి నారాయణరెడ్డి, చౌదరి, డాక్టరు రాజాబహదూర్ గౌడుగార్లను, తదితరులను కలుసుకొని దాదాపు 2½ గంటలసేపు దీర్ఘసంభాషణలు జరిపారు. ఈ సంభాషణల్లో వారు తెలంగాణా పరిస్థితిని సాకల్యంగా ముచ్చటించుకొన్నారు. రాజీ పరిష్కారానికి అవసరమను కొన్న షరతులనుగురించి కూడా వారు మాట్లాడుకొన్నారు."

తానూ, తన సహచరులూ మళ్ళీ రేపు కమ్యూనిస్టు ఖైదీలతో మాట్లాడదలచుకొన్నట్లూ, రాజీ పరిష్కారం షరతులు రేపు సమావేశంలో తేల్చనున్నట్లూ జ్యోతీబసుగారు నేటి సాయంత్రం వెల్లడించారు.

సంస్థాన ప్రభుత్వంవారిని ఎప్పుడు కలుసుకొంటారని అడగ్గా ఆయనేమీ సమాధానం చెప్పలేదు.

స్థానిక నాయకులతో స్వేచ్ఛగానూ, నిరాటంకంగానూ, సంపూర్ణంగానూ మంతనాలు జరపడానికి యీ వచ్చిన నాయకులకు ప్రభుత్వంవారు అన్ని సౌకర్యాలు కలిగించారు. ఈ మంతనాలప్పుడు పోలీసులు అధికారులు కూడా ఎవరూ దగ్గర లేరట.

కమ్యూనిస్టు ఖైదీలతో ఈ సంభాషణలు ముగిసింతర్వాత వారి ఉద్దేశ్యాలు హైదరాబాదు ముఖ్యమంత్రికీ, హోం మంత్రికీ కూడా సవివరంగా తెలుపుతామని జ్యోతీబసుగారు చెప్పారు.

ఇవాళ తాము మాట్లాడదలచుకొని యుండిన బహిరంగసభలను నిషేధించడాన్ని ఆయన ఇలా విమర్శించారు: "మేమూ సభల్లో రానున్న జనరల్ ఎన్నికలను గురించి మాట్లాడదలచుకొనివుంటిమి. ఈ నిషేధం కేవలం అక్రమమూ, అకారణమూ, అసలు ప్రజాస్వామికానికే విరుద్ధమూ."

ఈ సభలు అసలు కమ్యూనిస్టుపార్టీ వారు ఏర్పాటు చేసినవి కావనీ, కన్వీనర్లనే పేరుతో కొందరు వ్యక్తులు ఏర్పాటు చేసినవనీ ఆయన వివరించారు.

## సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుని ప్రకటనపై జ్యోతిబసు వ్యాఖ్య

హైదరాబాదు, జూలై 22: కమ్యూనిస్టు నాయకులతో రాజీసంభాషణలే పనికిరావంటూ హైదరాబాదు ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు దిగంబరరావు బిందూగారు వెల్లడించిన అభిప్రాయాన్ని వ్యాఖ్యానిస్తూ కమ్యూనిస్టు నాయకుడు జ్యోతిబసుగారు ఒక పత్రికా ప్రకటన చేశారు. "ఇలాంటి వైఖరి కనబరచడానికి ఒక్కటే కారణం కనిపిస్తున్నది. తెలంగాణాలో శాంతిభద్రతలు నెలకొని కమ్యూనిస్టు పార్టీపై నియమ నిషేధాలు తొలగిపోతే కమ్యూనిస్టులు నిరాటంకంగా ముందుకు వచ్చి ఆ ప్రాంతాల్లో నాయకత్వం కూడావహిస్తారనీ, కాంగ్రెసువాదులను ఘనతగల తమ పదవులనుంచి తరుమగొడతారనీ బిందూగారికి బెదురు పుట్టినట్లున్నది. కాని మాయీపరిష్కారపు ప్రయత్నంలో హైదరాబాదు ప్రజలంతా మా అండనిలుస్తారని ఆశిస్తున్నాను."

## 'వినోబాతో సంప్రతిస్తే గాని రాజీ కుదరదు'

### కమ్యూనిస్టు నాయకులకు ఉగ్రీకర్ సలహా

హైదరాబాదు, జూలై 21: ఆచార్య వినోబాభావేగారితో సంప్రదించనిదే తెలంగాణా కమ్యూనిస్టులకూ, ప్రభుత్వానికీ మధ్య రాజీ కుదర్చడం సాధ్యపడదనీ, తెలంగాణా పరిస్థితి అంతా ఆయనకు కరతలామలకమనీ, అక్కోగట్లాలన్నీ ఆయన ఒక్కడే బాగా ఎరుగుననీ హిందూ సేవాసంఘం అధ్యక్షుడైన వి. వి. ఉగ్రీకర్ గారు నేడిక్కడ వెల్లడించారు. పత్రికలకు విడుదల చేసిన ఒక ప్రకటనలో ఆయన ఇంకా యిలా అన్నారు: "ఇప్పుడు డిటెన్షనులో ఉన్నటువంటి కమ్యూనిస్టు నాయకులు హైదరాబాదు కమ్యూనిస్టుపార్టీ తాలూకు అధికృతులైన నాయకులు కానేకారు. (ప్రస్తుతం ప్రచ్ఛన్నంగా తిరుగుతున్న) రావి నారాయణ రెడ్డిగారి నాయకత్వాన మరొకవర్గం వుంది. దానికి కమ్యూనిస్టు పార్టీ ప్రస్తుత విధానం పూర్తిగా సరిపడదు."

నారాయణ రెడ్డిగారి ఆ వర్గంవారిని కలుసుకొని, వారితో ఈ విషయం మాట్లాడి, ప్రభుత్వానికీ కమ్యూనిస్టు పార్టీకీ మధ్య సంభాషణలు సాగడానికి తగిన సావకాశం సిద్ధపరచవలసిందిగా రాజీ రాయబారాలు నడుపుతున్న కమ్యూనిస్టు నాయకుల జట్టును ఉగ్రీకర్ గారు కోరారు.

### కేసు అవాయిదా

హైదరాబాదు, జూలై 22: నేడు జరుగవలసి యుండిన సికిందరాబాదు కేసులు విచారణ వర్షంతో కేసు కోర్టు అంతా బురదమయమై యున్నందువల్ల 25-వ తేదీకి వాయిదా వేయడమైంది.

# పారిశ్రామిక వివాదాల సామరస్య పరిష్కారం

## జగ్జీవన్ రామ్ గారి సలహా

మద్రాసు, జూలై 22: కార్మికులు, యజమానుల మధ్యకలిగే తగాదాలన్నీ ప్రభుత్వ మంత్రాంగం జోక్యం కలుగ జేసుకోవలసిన అవసరం లేకనే ఉభయ పక్షాలు పరస్పరముగా అన్యోన్య ముగా సామరస్యంతో పరిష్కరించు కోగల పరిస్థితులు దేశంలో కలగాలని అలక్ష్య సిద్ధిసే ఇండియా ప్రభుత్వ కార్మిక విధానంలో ముఖ్యాంశమని భారత ప్రభుత్వ కార్మికమంత్రి శ్రీ జగ్జీవన్ రామ్‌గారు నిన్న సాయంత్రం రాయపేటలో సింప్సన్ కూటమి కంపెనీల యూనియన్ వార్షిక మహా సభ ప్రారంభోత్సవం జరుపుతూ నుడి వారు. యూనియన్ అధ్యక్షుడు శ్రీ ఆర్. వెంకట్రామన్ గారు అధ్యక్షత వహించారు. కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ ఆర్. అనంతరామ కృష్ణన్ గారితో సహా ఎక్కువ మంది సభ వలంకరించారు.

మద్రాసు ప్రభుత్వ కార్మికమంత్రి శ్రీ హెచ్. సీతారామ రెడ్డి గారు జాతీయ పతాకోత్సవం జరుపుతూ పతాకం పవిత్రతను గౌరవాన్ని కార్మికులు కాపాడాలని కోరారు. కార్మికులు, యజమానులు అన్యోన్య ముగా తగాదాలను పరిష్కరించుకొన గల్గుట వారిలో ఐక్యతకు శుభసూచక మన్నారు.

మహాసభ విజయంకోరుతూ శ్రీయుతులు సి. రాజగోపాలాచారి, యన్. గోపాలస్వామి అయ్యంగారు వారికృష్ణ మెహతాబ్ లాడెన్‌గార్లు సందేశాలు పంపారు.

### సమిష్టిబలంతో కోర్కెలు సాధించడం

శ్రీ జగ్జీవన్‌రామ్‌గారు సభా వేళ ప్రారంభోత్సవం జరుపుతూ, యిల్లా అన్నారు: యజమానులు పనివారు పరస్పరము సామరస్యంతో వివాదాలను పరిష్కరించుకొన గల్గడమే పారిశ్రామిక శాంతికి దారితీయునని నేను ఎప్పటికీ తలచుచున్నాను. కార్మిక వివాదాలను పనివారు తమ సమిష్టిబలముతో చాలావరకు అన్ని సందర్భాలలో సామరస్య మార్గంలోనే పరిష్కరించుకొనగల పరిస్థితి దేశంలో ఏర్పడడమే ప్రభుత్వ లక్ష్యం. తగాదాల పరిష్కారంలో ప్రభుత్వ ఆఫీసర్ల జోక్యం ప్రసక్తి అవసరంలేకయే వివాదాలు అన్యోన్యముగా పరిష్కరించుకోగల స్థితి దేశంలో యేర్పడాలనియే నా ఆశయం. అయితే మన దేశంలో ట్రేడు యూనియనులు సమిష్టిబలంతో చేయగలిగే పరిస్థితిలో యింకాలేవుగాపున కార్మికుల హక్కులను రక్షించుటకు శాసనములు కార్మికకోర్టులు తదంగమంతా కావలసి యుంటున్నది. రాజకీయములో ప్రజాస్వామ్య సిద్ధాంతం అనుసరించిన మాదిరి పారిశ్రామిక విషయములో కూడా యజమానులు పనివారు పరస్పర సామరస్యం అన్యోన్యభావములతో వ్యవహరించగల పరిస్థితులు కలుగజేయడమే ముఖ్యంగా జరగాలి. పారిశ్రామిక ప్రపంచంలో కూడా ప్రజాస్వామ్య పద్ధతి సాధించడం చాలా అవసరం. ఈ లక్ష్యసాధనకు పారిశ్రామిక వివాదాల పరిష్కార చట్టంలో వర్కు కమిటీలు ఉండాలని శాసించినాము. యజమాని, సామాన్య కార్మికుడు ముఖాముఖిగా కూర్చొని వివాదాంశాలను చర్చించుకొని పరిష్కార మార్గాలను అన్వేషించేటప్పుడు కార్మికులు యజమానులతో తేలమాడగల స్థైర్యం బలం చేకూరుతుందనే యీ కమిటీలు నియమించాము.

అన్యోన్యముగా పరిష్కారం కానట్టి తగాదాల సందర్భాలలో పారిశ్రామిక కోర్టులుఅవసరమైనఆలస్యంలేకుండా అన్ని వర్గాలకు న్యాయమైన పద్ధతిలో తీర్పులొసగుటకు ప్రూనవలెనన్నారు. కాయకష్టం చేసేవారికి బుద్ధి జీవులకు యీ విషయంలో భేదం ఉండరాదు.

శ్రీ వి. వి. గిరిగారు తిరువాతి సింప్సన్ యూనియన్ కార్మికులు జబ్బు పడినపుడు, ఎవరైన చనిపోతే వారికుటుంబాలకు సహాయ్యపడే నిధిని ప్రారంభించారు.

శ్రీ ఆర్. వెంకట్రామన్‌గారు పనివారు ఐక్యతతో యూనియన్‌ను బలపరచాలని కోరారు.

# "కాంటర్బరీ బిషప్పును తొలగించాలి"

## బ్రిటిష్ పార్లమెంటులో తీర్మాన ప్రతిపాదనకు ప్రయత్నం

లండను, జూలై 19: కాంటర్బరీ బిషప్పు ఇటీవల రష్యాకు వెళ్ళి అచటి వైజ్ఞానిక పండితపరిషత్తుకు హాజరై ఇప్పుడే తిరిగి యింగ్లండుకు వచ్చిరి. అక్కడ వీరు కమ్యూనిస్టు ఉద్యమమును ప్రశంసిస్తూ ప్రసంగించారు. వీరు కమ్యూనిస్టు అధీనాన ప్రీతిలు గనుక వీరిని కాంటర్బరీ బిషప్పు పదవి నుంచి తొలగించవలెనని పార్లమెంటు కోరవలెనని కొందరు సభ్యులు ఒక తీర్మానమును ప్రతిపాదించుటకు కన్సర్వేటివు పార్టీ సభ్యులు ఆలోచన చేసిరా త్రి నిశ్చయించిరి. కాంటర్బరీ బిషప్పు గారి వయస్సు 77 సం॥ లు. ఇదివరకే కమ్యూనిస్టు భావాలు కలవారని ప్రసిద్ధి పొందియున్నారు. [illegible]

చాగలమర్రిలో జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు ఆర్. కె. రామలింగారెడ్డి గారు.

# 'కమ్యూనిస్టు దుశ్చర్యలను ప్రభుత్వం నిర్మూలిస్తుంది'

## నంద్యాలపౌరులకు గవర్నర్‌గారి అభయం

కర్నూలు, జూలై 21: నంద్యాల పరిసర ప్రాంతాలలో నానాటికి పెరుగుతున్న కమ్యూనిస్టు హింసాకృత్యాలవల్ల, ప్రజల ఆస్తికి, ప్రాణాలకూ తీవ్రఉపద్రవ పరిస్థితి యేర్పడిందని, ప్రభుత్వం వెంటనే యీ ఉపద్రవ నిర్మూలనకు చర్యగై కొనాలని, నంద్యాల పురపాలక సంఘం అర్థించగా, ప్రభుత్వం సర్వశక్తులూ వినియోగించి, కమ్యూనిస్టు హింసాకృత్యాలను నిర్మూలించుటకు కృతనిశ్చయమై అందుకుతగినచర్యలు గైకొంటుందని గవర్నర్ గారు అభయమిచ్చారు.

నిన్న చాగలమర్రిలో 28 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను ప్రారంభించిన తరువాత, గవర్నరు గారు కారులో నంద్యాలకు తిరిగి వచ్చారు. సాయంకాలం స్థానిక అధికారులను గవర్నరుగారికి పరిచయం చేశారు. బంగనపల్లి నవాబు, నివర్తి వెంకటసుబ్బయ్య, పెండెకంటి వెంకట సుబ్బయ్య, గోపవరం వెంకటరెడ్డి, యం. జె. శామ్యూల్, నంద్యాల చైర్మన్ డి. కుప్పరావుగారలు, సాయంకాలం గవర్నరుగారిని, సందర్శించారు. గవర్నరుగారు బురదతో నిండిన ఇరుకురోడ్ల వెంట పట్టణం చూడడానికి బయలుదేరారు. మూడుచోట్ల గవర్నరుగారికి ప్రజలు పూలమాలలు వేశారు. పురపాలకసంఘ కార్యాలయంవద్ద గవర్నరుగారు కారు దిగి నడవాలని ప్రయత్నించారు. కాని జనసమూహం ఆయనను చుట్టివేయడంతో ముందు కదలడం సాధ్యం గాకపోయింది. అతి కష్టం మీద ఆయన కారుదగ్గరకు తిరిగి వచ్చారు. పట్టణం చూచినపిదప పౌరసన్మానం స్వీకరించేందుకు రామనాథటాకీసుకు వెళ్లారు. పురపాలకసంఘ సభ్యులు, నంద్యాలమునిసిపల్లులసంఘం వారు, యిచ్చిన తేనీటి విందు ఫోటో అయినపిదప, పురపాలకసంఘాధ్యక్షుడు కుప్పరావుగారు పురపాలకసంఘం తరఫున స్వాగతపత్రం సమర్పించారు. ఆస్వాగతపత్రంలో "నంద్యాల చుట్టు ప్రక్కల కమ్యూనిస్టుల హింసా కృత్యాలు నానాటికి పెరుగుతున్నవి. ప్రజల ప్రాణాలకు, ఆస్తిపాస్తులకు ఉపద్రవ పరిస్థితి యేర్పడింది. అందువల్ల పెద్ద రైతులు చాలామంది గ్రామాలు, భూములు వదిలి నంద్యాల కర్నూలు పట్టణాలకు వలస వచ్చి నివసిస్తున్నారు. ఈ భూస్వాములు తమ పొలాలను వదిలి రావడంచేత, ఆహార ధాన్యాలు పండే పొలాలు బీడుపడిపోతున్నవి. వీరి వలసవల్ల పట్టణాలలో యిండ్లు దొరకక పోవడం, ఆహార ధాన్యాలకు కొరత యేర్పడడం సంభవించింది. ఈ దుస్థితిని నివారించుటకు వెంటనే తగు చర్యలు తీసుకోవాలి" అని అర్థించడమైనది. మునిసిపల్ హయ్యర్ ఎలిమెంటరీ బాలికల పాఠశాలను మిడిల్ స్కూలుగా చేయించాలని గూడా స్వాగత పత్రంలో గవర్నరు గారిని కోరడమైనది.

నంద్యాల మునిసిపల్లుల సంఘంవారు గవర్నరుగారికి స్వాగతపత్రం సమర్పిస్తూ, వేరుశనగ, తినుబండారములో చేరిన పదార్థము గనుక మిగతా ఆహార పదార్థాల విషయంలో రౌలాంటి సదుపాయాలున్నవో, వేరుశనగకు కూడా అలాంటి సదుపాయాలు కల్పింపబడాలని, వేరుశనగపై కేంద్ర ప్రభుత్వం అమ్మకం పన్ను తొలగించింది. రాష్ట్ర ప్రభుత్వాలుగూడా ఈపన్ను తొలగించాలని గవర్నరుగారిని అర్థించారు.

ఈ స్వాగతపత్రాలకు, అందరి కోర్కెలకు గవర్నరుగారు సమాధానం చెబుతూ, మీ కోర్కెలన్నింటిని మంత్రులకు "తెలియజేస్తాను" అని చెప్పారు.

కమ్యూనిస్టుల హింసా చర్యలను తన్నివారణ ప్రయత్నాలను సూచించి గవర్నరుగారిలా అన్నారు.

"ఈ పట్టణ పరిసరగ్రామ ప్రాంతాలలో సాగించబడుతున్న కల్లోల చర్యలను, వాటివల్ల ప్రజలనుభవిస్తున్న కష్టాలను నేను పూర్తిగా తెలుసుకొన్నాను. కనిపించిన జాగాలో నా దాకు వీరు కల్లోల సంఘటనలు జరిగాయనుకొంటా.

నా ప్రధానమంత్రి, తదితర మంత్రులు [illegible] ప్రయోగించి నిర్మూలించుటకు ప్రభుత్వం కృతనిశ్చయమై ఉన్నదని నేను వినయ పూర్వకంగా యివ్వగలను. ఈ ప్రాంతంలో పోలీసుబలంగూడా చాలా హెచ్చించబడింది. ఆ యా చోట్ల సాయుధ సిబ్బంది పెంపొల్పబడింది. గ్రామస్థులు తమంతతామే ఆత్మరక్షణకు పూనుకోవడం చేయడానికి ప్రయత్నం జరుగుతున్నది. అయితే ప్రభుత్వం ఏ చర్య తీసుకొన్నా గ్రామస్థులు, శాంతిభద్రతలసంరక్షకులతో మనస్ఫూర్తిగా సహకరించనిదే, అది జయప్రదం కానేరదు. గ్రామసులనుండి ఈ సహకారం లభించాలంటే రెండు ముఖ్యాంశాలు గమనించాలి. శాంతిభద్రతల సంరక్షకులు, పోలీసులు, తమయెడ ప్రజలకు విమ్మకము విశ్వాసము కలిగేట్లుగా ప్రవర్తించాలి. అలాగే ప్రజలుగూడా పోలీసులయెడ విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. అయితే యిది అంతతేలిక గాదని, కొన్ని ఆటంకాలున్నవని నాకు తెలియక పోలేదు. పోలీసు అంటే ప్రజలశత్రువు అని పూర్వం నుంచి ప్రజలలో ఒక విధమైన నమ్మకం ప్రబలి ఉన్నది. అదిగాక తిరువాతి తమపై మళ్ళీ ప్రతీకారం జరుగుతుందనే భయం గూడా ఉన్నది. ప్రజా విశ్వాసాన్ని చూరగొనుట ఆత్మవిశ్వాసకరమన్న సంగతి పోలీసులు పూర్తిగా గ్రహించారు. ఇందుకు తగ్గట్టుగా పోలీసులు ప్రవర్తించేట్లు అధికారులు చూడగలరు. ఈ జిల్లాలో పోలీసుల ధర్మ నిర్వహణ అత్యంత క్లిష్టమైనది. అతి ముఖ్యమైనది. కాబట్టి, యీ ధర్మ నిర్వహణలో పోలీసులయెడ విశ్వాసం కలిగి, వారితో సహకరించాలి.

వచ్చే ఎన్నికల, విషయం ప్రస్తావిస్తూ "ప్రజా సహకారం పూర్తిగా లేనిదే శాంతిభద్రతలకు భంగం వాటిల్లకుండా, యీ ఎన్నికలను నిర్వహించుట యిందుమించు అసాధ్యమని" గవర్నరుగారన్నారు. నిన్న మధ్యాహ్నము మహారాణీ, గవర్నమెంటు హాస్పటల్, మిషన్ హాస్పిటల్‌ను సాయంకాలం మిషన్ హైస్కూలును దర్శించింది.

### బెంగుళూరుకు ప్రయాణం

కర్నూలు [illegible] విరామంగా ఉపవిశ్రమింపలేనికి బయలుదేరి వెళ్లారు.

# 'విజ్ఞానవ్యాప్తికి అందరి చేయూత అవసరం'

## ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభను ప్రారంభిస్తూ గవర్నర్ గారి ఉద్బోధ

నంద్యాల, జూలై 21: మద్రాసు రాష్ట్రగవర్నర్ భావనగర్ మహారాజాగారు, నిన్న చాగలమర్రిలో ఆంధ్రదేశ గ్రంథాలయ 28వ మహాసభను ప్రారంభిస్తు, జనసామాన్యంలో విజ్ఞాన ప్రచారానికి చేసే ప్రయత్నాలకు అందరూ చేయూత యివ్వాలని విజ్ఞప్తిచేశారు. గ్రంథాలయ చట్టం సవ్యంగా అమలు జరిగేందుకు ప్రజలు తోడ్పడాలని, విద్యావ్యాప్తి ఉద్యమం విషయంలో ప్రత్యేక శ్రద్ధవహించాలని కోరారు.

"విద్యయొక్క పరమార్థం గ్రామీణులను, ఎర్రని ఏ గానిలేకుండా ఉద్యోగాలకోసం అన్వేషించే నిరుపేద పట్టణవాసులు గామార్చడం గాదు. గ్రామప్రజల జీవనాధారమైన వృత్తులకు సహాయకారిగా ఉంటూ మన సంస్కృతి, సారస్వతము, చరిత్ర, దేశా స్నెరుగొంటున్న ప్రస్తుత సమస్యలు యీ మొదలు వాటిని సవ్యంగా వారు అవగాహన చేసుకొనేట్లు చేయడమే విద్యకు పరమార్థంగా ఉండాలి."

"సర్వోదయ ఆదర్శాలను సాధించేందుకు ప్రతివారు కృషి చేయాలి. ఈ కృషి సందర్భంలో పట్టణవాసులు గ్రామాలకు పత్తే బదులు గ్రామాలలోనే సర్వోదయ కార్యకర్తలను యెంచాలి. అలా అయినప్పుడే సర్వోదయ కార్యకర్తలు గ్రామీణుల సమస్యలేవో సులభంగా తెలుసుకోగలిగెదరు." అని గవర్నర్ గారు అన్నారు.

భావనగర మహారాజా మహారాణీ స్పెషల్ రైలులో కర్నూలునుండి బయలుదేరి నిన్న తెల్లవారు ఝామున యిచటికి వచ్చారు. వీరి వెంట, కార్యదర్శి కే. గోవిందనాయర్, మిలిటరీ కార్యదర్శి సి. యస్. రెడ్డి, అంగరక్షకుడు కెప్టెన్ కె. మణి, ప్రభృతులు వచ్చారు. నిన్న మహారాజా, మహారాణీ, యిచటికి 10 మైళ్లలో ఉన్న సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన మహానందికి వెళ్లారు. దేవాలయ ధర్మకర్తలు, మహారాజదంపతులకు స్వాగతమిచ్చి, ఆలయం నలుప్రక్కల చూపించారు. పూజానంతరం, తేనీటి విందు పుచ్చుకొని, గవర్నర్ గారు, కలెక్టర్ పి. వి. మాధవరావు గారితో కలసి, 28 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను, ఆంధ్రరాష్ట్రసంఘ సేవకుల మహాసభను ప్రారంభించేందుకు, అచటికి 40 మైళ్ళ దూరంలో ఉన్న చాగలమర్రి గ్రామం వెళ్లారు.

త్రోవపొడుగునా గ్రామస్థులు గవర్నర్ గారికి స్వాగత మిచ్చారు. ఆళ్లగడ్డ, సిరివెళ్ల, బత్తలూరు గ్రామస్థులు గవర్నర్ గారికి పూలమాలలు వేశారు.

గవర్నర్ గారు గ్రామస్థులను పరామర్శించి వారి పంటలవిషయం అడిగారు. చాగలమర్రికి రాగానే, గ్రామస్థులు మేళతాళములతో గవర్నర్ గారిని ఊరేగించి, గ్రంథాలయ మహాసభ వేదికవద్దకు తీసుకొని వెళ్లారు. వేదిక వద్ద మహాసభ నిర్వాహకులు గవర్నర్ గారికి స్వాగతమిచ్చి వేదికపైకి తీసుకొనివెళ్లారు. మహాసభకు ప్రతినిధులు 4 వేలమంది ప్రజలు వచ్చారు.

ప్రార్థనానంతరం ఆహ్వాన సంఘాధ్యక్షుడు ఆర్. కె. రామలింగారెడ్డి గారు సభికులకు స్వాగతం చెబుతూ, ఆర్థికంగాను, విద్యావిషయకంగాను, రాయలసీమ దుస్థితిని వర్ణించారు. విద్యావిధానం ప్రస్తుత అవసరాలకు అనుగుణంగాలేదని ప్రాథమిక విద్యబోధనే, మార్గాంతరమని అన్నారు. గ్రామాలలో చదువు సంస్కారము కలిగినవారు పట్టణప్రాంతాలకు వలస వస్తుండుటచే అజ్ఞానము, మూఢ భావాలు గ్రామాలలో తాండవిస్తున్నవని, యీ దుస్థితినివారణకు ఉపాయము సర్వోదయ ఉద్యమమేనని రామలింగారెడ్డిగారన్నారు. గ్రంథాలయోద్యమం విషయమై ప్రస్తావిస్తూ, గ్రంథాలయాల పరిపాలనా బాధ్యతను ప్రభుత్వమే వహించుట ఉత్తమమని అన్నారు. ఆంధ్రదేశంలో వయోజన విద్యాడైరెక్టరుకు తగిన సదుపాయాలను కల్పించాలని ప్రభుత్వాన్ని కోరారు. పిమ్మట గవర్నరుగారు మహాసభను ప్రారంభించారు.

# ప్రాచ్య విద్యాలయాల పునర్నిర్మాణం

మదరాసు, జూలై 30: కేవలం సంస్కృతం, తెలుగు తమిళం, అరబ్బీ బోధన ఇచ్చే పాఠశాలను పునర్నిర్మాణమునకు ప్రభుత్వమువారు ఉత్తర్వు చేశారు. 1951/52 నుండి అమల్లోకి రానున్న క్రొత్త ఏర్పాట్ల క్రింద ఈ పాఠశాలలను నడిపే వారికి నికరనిర్వహణ ఖర్చులలో 2/8 గ్రాంటు క్రింద ఇస్తారు. వీనిని వెంకడరీ స్కూళ్ళ హోదాకు మార్చారు. వీనిలో చదివే విద్యార్థులు యస్. యస్. యల్. సి. పరీక్షకు కూర్చొని ఇంగ్లీషు, సామాజ శాస్త్రము, హిందీ పరీక్షా పత్రములకు జవాబు వ్రాయవచ్చును. ఇట్లు ఉత్తీర్ణులయిన వారిని కళాశాలలో చేర్చుకొనవచ్చును. ప్రస్తుతపు ఆధ్వాన్న సంస్కృత స్కూల్సు ఉన్న తపాఠశాలలుగా గాని, మిడిల్ స్కూల్సుగాని మారుటకు 3 సం॥ముల గడువు ఇచ్చారు.

## బండితో బస్సుడీకొన్న ప్రమాదం

మదరాసు, జూలై 22: నిన్న మధ్యాహ్నం మౌంటురోడ్ లో చెలితోలాగే బండితో ఒక గవర్నమెంటు బస్సు డీకొని బండిలోనుండి కొన్ని కేసుల సారాయిబుడ్లు విరిగి నష్టంచేకూరింది. బండిచక్రములలో నొకటి దూరముగా పడిపోయింది. తదితర్యం భాగాలు విరిగి రోడ్ మీద పడ్డవి. విరిగిన సారాయి బుడ్లముక్కలు ఆ ప్రదేశమంతటాపడియుండెను. బండిలాగు చుండిన మునుస్వామి, కొండయ్యఅనువారికి కొద్దిగా గాయాలు తగిలాయి. వారు జనరల్ ఆసుపత్రిలో చేర్చబడ్డారు.

## మదరాసు విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్ర బోధన

మదరాసు, జూలై 22: మదరాసు విశ్వవిద్యాలయ సిండికేటు నిన్న సమావేశమై వచ్చే సెలమండి అంతర్జాతీయ న్యాయశాస్త్రము రాజ్యాంగ న్యాయశాస్త్ర బోధన విభాగమును ప్రారంభించుటకు నిశ్చయించారు. ఈ విభాగము లండన్ విశ్వవిద్యాలయపూర్వపు ప్రొఫెసరు డా॥ అలెగ్జాండర్ విక్ క్రింద వుంటుంది. వీరు ఆగస్టులో వచ్చి ఉద్యోగము స్వీకరించెదరని అనుకుంటున్నారు.

అనేక కళాశాలల ప్రిన్సిపాల్సు కోరినందున ఇంటర్ మీడియట్ క్లాసులో మానవతిశాస్త్రతరగతిలో మూడూరు 700 మందిని అదనముగా తీసుకొనుటకు సిండికేటు అంగీకరించినది.

## శ్రీ ఐ. ఎస్పు పెరీరా మరణం

మదరాసు, జూలై 21: సింహళ మాజీ పరిశ్రమల మంత్రి శ్రీ ఐ. ఎస్పు పెరీరా 66 వ ఏట కొలంబోలో చనిపోయినట్లు ఇక్కడకు చేరిన వార్తవల్ల తెలుస్తోంది. శ్రీ పెరీరా చాలాకాలం సింహళ పార్లమెంటులో భారతీయ ప్రతినిధి. వీరు మదరాసు ఆహారమంత్రి శ్రీ గోపాల్ విశ్వోదయా నాదవునిరి.

## రాష్ట్రంలో ఆరోగ్యం

మదరాసు, జూలై 20: జూను 30వ తేదీతో అంతమైనవారం కన్న రాష్ట్రమందు అంటు వ్యాధుల ప్రాబల్యం యీ రీతిగా నుండెను. కలరా కేసులు 1009 చావులు 428, మశూచికం కేసులు 748 చావులు 174, ప్లేగు [illegible] కేసులు తగ్గినయి.

# ప్రకాశం పంతులుగారి కంచువిగ్రహ ప్రతిష్ఠా మహోత్సవం

విజయవాడ, జూలై 22: ఆంధ్ర నాయకులలో అగ్రగణ్యులైన శ్రీ ప్రకాశం పంతులు గారి కంచువిగ్రహ ప్రతిష్ఠా మహోత్సవం, యీ సాయంకాలం యిక్కడ జరుగుతున్నది. ఈ మహోత్సవాన్ని సందర్శించే కౌతూహలంతో, పరిసరగ్రామాలనుండి పట్టణాలనుండి వేలాదిప్రజలు వచ్చారు. ప్రకాశంగారి కంచువిగ్రహ ప్రతిష్ఠా మహోత్సవ సభకు అధ్యక్షత వహించే నిమిత్తం పశ్చిమ బెంగాలు ప్రజాపార్టీ నాయకులు డా॥ ప్రఫుల్లచంద్ర ఘోష్ నాగరకతరాత్రి కలకత్తా మెయిలులో యిచటికి వచ్చారు. విగ్రహాన్ని ఆవిష్కరించుటకు, కేంద్ర ప్రభుత్వ తంతి తపాలాశాఖా మంత్రి రఫీ అహమ్మద్ కిద్వాయ్‌గారు, ఢిల్లీనుంచి విమానంమీద యీ మధ్యాహ్నం వస్తున్నారు.

డా॥ ప్రఫుల్లచంద్ర ఘోష్‌గారు సరిగా 7-30 గంటలకు మెయిలు దిగారు. శ్రీ వివ్వడి లింగరాజు, కొమ్మారెడ్డి సూర్యనారాయణ పురపాలక సంఘాధ్యక్షుడు తెన్నేటి చలపతిరావు గారలు యింకా అనేకమంది ప్రముఖులు జయధ్వానాలతో ఘోష్‌గారికి స్వాగతమిచ్చారు. కంచువిగ్రహప్రతిష్ఠాసంఘ కార్యదర్శి డా॥ కంభంపాటి విష్ణువర్ధన రావుగారు ఘోష్‌గారిని పుష్పమాలాలంకృతులన్జేసి 'దుర్గావిలాస్' భవనానికి తీసుకొని వెళ్ళారు. దుర్గావిలాస్ భవనంలో పత్రికా విలేఖరులు కలుసుకోగా, వారితో సంభాషిస్తూ, బాధ్యతగల వారెవరూ పత్రికా ప్రకటన చేయటానికి పూనుకోకూడదు. అని ఫలోక్తిగా అన్నారు. పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తున్న సమయంలో శ్రీ ప్రకాశంగారువచ్చి కులాసాయేనా అని అత్యంత ఆప్యాయంగా ఘోష్‌గారిని పరామర్శించారు. ఉభయులు ప్రేమాతిశయంతో ఆలింగనం చేసుకొన్నారు. మెయిలులో ప్రయాణం సుఖంగాసాగిందాఅని ప్రకాశంగారడిగారు. "అ సుఖంగానే సాగింది అని జవాబిచ్చారు. ఘోష్‌గారి మాటలాడుతుంటే, ఆయన జలుబుతో బాధపడుతున్నట్లు కన్పించింది. దానిపై ప్రకాశంగారు"మీరుశస్త్రజ్ఞులుఆరోగ్యం విషయంలో బహు జాగ్రత్త తీసుకోవేవారు. మీరుగూడా యీ జలుబు పట్టుకొన్న దేమనిఅన్నారు. కృపాలనీతో కలసి పర్యటిస్తున్న సమయంలో యీ జలుబు పట్టుకొన్నదని ఘోష్ గారు చెప్పారు. వృద్ధాప్యపు దశలో గూడా చక్కని ఆరోగ్యం కలిగి ఉన్నందుకు ప్రకాశంగారిని ఘోష్ గారు ప్రశంసించారు.

తమపనికి వృద్ధాప్యం అడ్డు రాదు. రాజాలదు. అని ప్రకాశంగారు ఎదురుమాట విసిరారు. ఘోష్‌గారు చిరునవ్వు నవ్వుతూ, వృద్ధులైనవారంతా అలాగే అంటారులే అని అన్నారు. ప్రకాశంగారు"అవును నిజమే. వృద్ధాప్యం ఎవరికోసమూ ఆగదు. మనకు తెలియకుండా నేమనల్ని ఆవహిస్తుంది. కానినాకు అది అడ్డురాజాలదు. నేనూ వృద్ధాప్యాన్ని గురించి ఆలోచించనూ కూడా లేను" అని అన్నారు.

ఈ సంభాషణానంతరం ప్రకాశంగారు, విశాఖ పర్యటన రద్దుచేయబడినట్లు తెలిపారు. గుంటూరుజిల్లాలో రెండురోజులు పర్యటించాలని ఘోష్ గారిని అడిగారు. ఘోష్‌గారు అందుకు సమ్మతిస్తూ, అసలు అమరావతి, నాగార్జునకొండ, సందర్శించవలెనే ఆంధ్రలో పర్యటన పూర్తిఅయినట్లు కాదు. అని అన్నారు. పిదప ప్రకాశంగారు, అమరావతి, నాగార్జున కొండల శిల్పకళా విశిష్టతను గురించి ఘోష్ గారికి చెప్పారు. "కొన్ని ఉత్తమ శిల్పకళాఖండాలు తప్పించుకపోకి ఢిల్లీకి తదితర ప్రాంతాలకు తరలించబడినాయి. సరే ఏదైనా మనం వాటిని చూస్తాంగదా. నాగార్జున పర్వతశిఖరాన్ని అధిరోహించి వలపైనుంచి ఆ సుందర మనోహర దృశ్యాన్ని వీక్షిస్తాం. గుంటూరుజిల్లా 24, 25 తేదీలలో పర్యటిద్దాం. 26 వ తేదీన మీరు కలకత్తా వెళ్లవచ్చు. అని ప్రకాశంగారు అన్నారు.

నాగార్జున కొండ అమరావతి క్షేత్రాలకు సంబంధించిన పుస్తకాలు [illegible] ప్రకాశంగారు పెద్దగానవ్వి, మేము అధారకం వింత మనుష్యులుగా తయారవుతున్నాం. మేము అలాంటి రికార్డులేవీ ఉంచము మేమెవరమో గూడ మరచిపోయాం" అని అన్నారు.

## ఊరేగింపు దృశ్యాలు

విజయవాడ, జూలై 22: కంచు విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవ సందర్భములో, ప్రకాశంగారి గౌరవార్థం, ట్రావెలర్స్ బంగాళానుండి మైలు పొడుగున పెద్ద ఊరేగింపు కంచు విగ్రహం ప్రతిష్ఠింపబడిన స్థలానికి బయలుదేరింది. ఈ ఊరేగింపులో పాల్గొన్న వారుగాని ఊరేగింపును చూచినవారుగాని దాదాపు లక్షమంది ఉంటారని చెప్పవచ్చు. ఈ ఉత్సవ సందర్భ కుతూహలంతో పరిసర జిల్లాలనుంచి తండోప తండాలుగా జనం వచ్చారు. ఊరేగింపు ట్రావెలర్స్ బంగాళానుండి ప్రారంభమై బీసెంట్ రోడ్డు గోపాలరెడ్డి రోడ్లలగుండా, మచిలీపట్నం హైదరాబాద్ రోడ్డుకు వచ్చి అచటినుంచి వంతెన క్రిందుగావచ్చి నేతాజీవిగ్రహాన్ని చుట్టి ప్రకాశంగారి కంచువిగ్రహం వద్దకు చేరింది. త్రోవపొడుగునా ఊరేగింపులో పాల్గొన్న జనసమూహం అంతకంతకూ పెరుగుతూనే వచ్చింది. రెండు వినుగులు, బాకావాళ్లు, డోలువాయిద్య గాళ్ళు ముందు, వారివెనుక ఒంటెలు, ప్రకాశం, గాంధి, సుభాష్ బోస్, భారతమాత, విశాలాంధ్ర చిత్రపటాలు అలంకరించబడిన 82 జతల ఎడ్లు పూన్చిన బండి ఆ వెనుక కోలాటం జట్లు, సన్నాయిమేళాలు, కల ఊరేగింపు పురోభాగాన ఉన్నవి. ఊరేగింపు చివరిభాగంలో ఆంధ్రకేసరికి జై, గాంధికి జై అన్న నినాదాలు ప్రతిధ్వనిస్తున్నవి. ఊరేగింపు నడిచే ప్రతిరోడ్డుపైనా 'ప్రకాశం జిందాబాద్' అన్న వాక్యాలలో ఆర్చీలు తీర్చి దిద్దబడిఉన్నాయి. ప్రకాశంగారి కంచువిగ్రహంవద్ద పెద్దవేదిక నిర్మింపబడింది. ప్రజలు యీ వేదిక చుట్టూ సమిగూడి ఉన్నారు. శ్రీ దాలిపర్తి సూర్యనారాయణ బృందము వారు సన్నాయిమేళం చేస్తున్నారు. ఈ దృశ్యమంతా ఫిల్ము తీయబడింది. ఈ కోలాహల దృశ్యంలో ఉత్సాహం అతిశయించిన యిద్దరు పిల్లలు కాలుజారి వీలూరు కాలవలో పడ్డారు కాని వారిని వెంటనే రక్షించడం జరిగింది.

కంచువిగ్రహ ఆవిష్కరణ సాయంకాలం కేంద్ర ప్రభుత్వ తంతి తపాలా శాఖామంత్రి జరుపుతారు. కంచు విగ్రహ కమిటీ అధ్యక్షుడు రంగాగారు ఈ ఉత్సవంలో పాల్గొనే నిమిత్తం వచ్చారు. ఇక్కడ వారం రోజులుగా వర్షాలు కురుస్తున్నవి. ఇవాళ గూడా ఆకాశం మేఘావృతమై ఉన్నది. వర్షం కురవకుండా ఉంటే ఉత్సవం జయప్రదంగా జరుగుతుంది. (స్వ. వి.)

# ప్రముఖుల సందేశాలు

విజయవాడ, జూలై 22: "మాతృదేశానికి శ్రీ ప్రకాశంగారు చేసిన సేవను గుర్తించి, కృతజ్ఞతాపూర్వకంగా ఆంధ్ర ప్రజానీకంవారి కంచు విగ్రహాన్ని ప్రతిష్ఠించటం నాకుచాలా ఆనందాన్ని స్తోంది. నలభైఏళ్లుగా కాంగ్రెసులో వారితోకలసి పనిచేయు భాగ్యం నాకు అబ్బింది. ఆయన తన జీవితాన్ని దేశసేవకు అంకితంచేసిన మహాపురుషుడు. మీ తోపాటు వారికి నా జోహారులు అర్పిస్తున్నాను, భగవానుడు ప్రకాశంగారికి దీర్ఘాయురారోగ్యాలు ప్రసాదించుగాక" అని బీహార్ గవర్నర్ మాన్యశ్రీ యం. యస్. అణేగారు ప్రకాశంగారి కంచువిగ్రహ ప్రతిష్ఠోత్సవానికి తమ సందేశాన్ని పంపారు.

భారత పార్లమెంటు అధ్యక్షులు శ్రీ మావలంకర్ గారు ఇలా వ్రాశారు: ప్రకాశంగారు కొలతతీరిన జాతీయ వీరుడు. నాకు వారు 1922 నుంచి తెలుసు. 1922 లో వారు అహమదాబాదువచ్చి నాకు రెండురోజులు అతిథిగా ఉన్నట్లు జ్ఞాపకం. మీ ప్రయత్నానికి నా శుభాకాంక్షలు.

డా॥ లంక సుందరంగారు ప్రకాశంగారి జీవితం, 'త్యాగసేవాలంకారం ముఖ్యమైన మహాకావ్యం.' అని అన్నారు.

వీరుగాక, శ్రీయుతులు రాజా మహారాజ్ సింగ్, సర్ ఆర్చీ నాల్డ్ నై, మాడపాటి హనుమంతరావు, వి. వి. గిరి, త్రిలోకసింగ్, డా॥ సైయద్ మహమూద్, యక్. ఎ. షెర్వాని, శ్రీప్రకాశ, జనరల్ కరియప్ప, యం. కె. వెల్లోడి, సి. డబ్లియు స్టిఫెన్సన్, బెజవాడ రామచంద్రారెడ్డి, హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం, సేట్ రామకృష్ణ దాల్మియా, హెచ్. యల్. జరత్, మహీం పామ్మెడ్, సి. యం. కుమారి, పి. భానుమతి, పుట్టపర్తి శ్రీనివాసాచారి, సత్తిపాల వెంకట్రామం, దివాకర్ల వెంకటావధాని, మధునాపంతుల సత్యనారాయణ, ప్రయాగ వరసింహశాస్త్రి, దుర్గి నాగాచార్యులు, దుర్గపాటి కుటుంబరావు, యస్. భీమారావు, గోవిందమీనన్ యం. యల్. ఎ., శ్రీకంఠం. కళా వెంకటరావు, మహాదేవ ప్రసాద్, కురుగంటి సీతారామయ్య గారలుకూడా తమ శుభాకాంక్షలు పంపారు.

## విగ్రహానికి విరాళాలుతోడ్పాటు

కొన్ని సంవత్సరాల క్రిందట డా॥ పర్వేపల్లి రాధాకృష్ణ కరాచీలో బాపూజీ కంచువిగ్రహాన్ని ఆవిష్కరించారు. అతిర్వాత క్రిందటి సంవత్సరం బొంబాయిలో స్వర్గీయ శ్రీ వల్లభాయ్ పటేల్ విగ్రహాన్ని భారత అధ్యక్షులు బాబూ రాజేంద్రప్రసాద్ ఆవిష్కరించారు. తిరుపతి నేటికి

# తెనాలి కళాశాల ప్రారంభోత్సవం

తెనాలి, జూలై 22: ఇచట నూతనంగా నెలకొల్పబడిన కళాశాలను, రాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు యీ ఉదయం 8 గంటలకు, స్థానిక మునిసిపల్ గరల్స్ హైస్కూలు భవనంలో ప్రారంభోత్సవం చేశారు.

స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి గౌ॥ కల్లూరు చంద్రమౌళిగారు ఉత్సవ సభకు అధ్యక్షత వహించారు. గోపాలరెడ్డిగారు ప్రారంభోత్సవం జరుపుతూ యీ పట్టణంనుంచి సీజన్ టిక్కెట్లపై అనేకమంది విద్యార్థులు గుంటూరు వెళ్ళి చదువుకోవలసివస్తుండడంచేత, యిచట కళాశాలను నెలకొల్పడం ఎంతైనా అవసరంగా ఉన్నదని అన్నారు. కళాశాలలో చదువుకొంటున్నంతకాలమూ విద్యార్థులు రాజకీయాల జోలికి పోకుండా ఉండాలనీ, చదువు పూర్తి అయిన పిదపరి, గురుతరమైన బాధ్యతలను స్వీకరించ గలుగుటకు అర్హులుగా తయారవ్వాలని చెప్పారు. చంద్రమౌళిగారు ప్రసంగిస్తు, కళాశాల కమిటీ వారు, కేవలం ప్రభుత్వ సహాయంపైనే ఆధారపడి ఉండకుండా ఫస్టుగ్రేడు కళాశాలగా మార్చుటకు తగినంత డబ్బు వసూలు చేయుటకు తమ ప్రయత్నాలను ద్విగుణీకృతం చేయాలని సలహా యిచ్చారు. గోపాలరెడ్డిగారు, ప్రారంభోత్సవం జరిపి వెంటనే, ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు వెళ్లారు. వారు వెళ్లిన కొంతసేపటివరకూ సభ జరిగినది. ఆ పిమ్మట చంద్రమౌళిగారు కళాశాలకు 40 వేల రూ. లవిరాళమిచ్చిన పి. రామమూర్తిగారి చిత్రపటాన్ని ఆవిష్కరించారు. కార్యదర్శి పి. వి. సుబ్బారావుగారు కార్యదర్శి నివేదిక చదివారు. ఇంతకు ముందే, మంత్రులకు స్వాగతపత్రాలు సమర్పించారు. పురపాలక సంఘాధ్యక్షుడు యస్. వెంకట్రావు, కళాశాల కార్యదర్శి గోపాలరెడ్డిగారికి పౌరసన్మాన పత్రాలు సమర్పించారు. వి. లక్ష్మీనారాయణ గారు కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ రాఘవాచార్యులుగారు, సభలో ప్రసంగించారు. గోగినేని రంగనాయకులుగారి వందనాలతో సభముగిసింది. స్వ. వి.

విజయవాడలో శ్రీప్రకాశం కంచు విగ్రహం ప్రతిష్ఠింప బడుతుంది.

విజయవాడలో మచిలీపట్నం హైదరాబాదు రోడ్డుమీద 'సబ్ వే' పడమటి పక్కన నేతాజీ సుభాష్ చంద్రబోసు సిమెంటు విగ్రహాన్ని మూడేళ్ళక్రిందట ప్రకాశంగారు ఆవిష్కరించారు. నేడు "సబ్‌వే" తూర్పు ప్రక్కన ప్రకాశంగారి కంచు విగ్రహాన్ని జనాబ్ రఫీ అహమద్ కిద్వాయ్ ఆవిష్కరిస్తున్నారు. యావదాంధ్రం నుంచి ఈ కంచు విగ్రహనిర్మాణానికి విరాళాలు వచ్చాయి. శ్రీ అడవి బాపిరాజు పర్యవేక్షణక్రింద శ్రీ రాజారాం నాగప్ప ఈ 7½ అడుగుల విగ్రహాన్ని తయారు చేశారు. దిమ్మతోసహా విగ్రహం ఎత్తు 14 అడుగులు. శ్రీమతి భానుమతి విరాళంతో కట్టిన ఈ గద్దెకు శ్రీ కాకాని వెంకటరత్నం శంఖుస్థాపన చేశారు. శ్రీయుతులు టి. అప్పలస్వామి, పి. కోటేశ్వరరావు చాలా జాగ్రత్తతో దిమ్మను కట్టిపెట్టారు. దిమ్మకుకావలసిన పల్లరాతిని శ్రీ వంకాయలపాటి సీతారామయ్య దానం చేశారు. విగ్రహాన్ని మద్రాసు నుంచి ఉచితంగా శ్రీయుతులు వల్లూరి శ్రీమన్నారాయణ, చెన్నుపాటి రామకోటయ్య నాగభూషణం తమలారీలపై చేరవేశారు. ఆంధ్ర కేసరి కంచు విగ్రహ ప్రతిష్ఠా సంఘ కార్యదర్శి శ్రీ కంభంమెట్టు విష్ణువర్ధనరావు తమ నివేదికలో వీరందరకు కృతజ్ఞత తెల్పుతూ, స్థానిక సంస్థలు విరాళాలివ్వటానికి అనుమతించిన ముఖ్యమంత్రి శ్రీ కుమారస్వామి రాజాకు, స్థానిక స్వపరిపాలనా మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళికి ప్రత్యేకంగా నమస్కారాలు తెలుపుతున్నారు. 26 మ్యునిసిపాలిటీలు, 5 జిల్లా బోర్డులు, 8 పంచాయతీ బోర్డులు విరాళాల్ని పంపాయి. అద్దంకి, స్థానం, బందా, పాతుపల్లి సుబ్బారావు, లక్ష్మణస్వామి ఇందు నిమిత్తమై సారంగధర నాటకాన్ని వేసి పెట్టారు. వీరుగాక డా॥ దలపతిరావు, తులసీరావు, పొరుపూడి సత్యనారాయణ, సత్తిరాజు వెంకటరావు, మొదలి వెంకటేశ్వరరావు, గోనెళ్ళ వెంకటేశ్వర్లు మొదలైన అనేకులు యీ ప్రతిష్ఠా కార్యక్రమం విజయవంతం కావటానికి అనంతంగా తోడ్పడ్డారని విష్ణువర్ధన రావుగారు నివేదిస్తున్నారు. ఆంధ్ర ప్రజానీకం, రాజకీయ విభేదాలను విస్మరించి, ఆంధ్రకుల వృద్ధులైన ప్రకాశంగారిని గౌరవించటానికి ఉత్సాహంతో చేసిన కృషి ఫలితమే ఈ కంచువిగ్రహం.

## మద్రాసు-ఢిల్లీ జనతా ఎక్స్‌ప్రెస్

నాగపూరు, జూలై 21:

యీ ఏడాది అక్టోబరు నుండి ఢిల్లీ, మద్రాసు నగరాలమధ్య జనతా ఎక్స్‌ప్రెస్ ప్రారంభమవుతుందని నేడిక్కడ విశ్వసనీయంగా తెలుస్తున్నది.

మదరాసు, జూలై 22: ఆహార వ్యవసాయ వ్యవస్థ ఉపకార వేతనము విషయ ఇండియా సింహళములలో సహకార ఉద్యమము గూర్చి పరిశీలించుటకు ఇంటర్నేషనల్ సహకారసంఘ డైరక్టరు జనరలు శ్రీ వాంగ్సీ శ్రీవస్తవ మదరాసు వచ్చారు.

# క్రీడారంగం

## ఇండియాలో పాకిస్తాన్ క్రికెట్ జట్టు పర్యటన

బొంబాయి, జూలై 22: ఇండియా క్రికెట్ కంట్రోల్ సంఘం ఆహ్వానించే పక్షంలో వచ్చే ఏడాది అక్టోబరు నెలనుండి డిశెంబరు నెలాఖరు వరకు పాకిస్తాన్ క్రికెట్ జట్టు ఇండియాలో పర్యటన చేస్తుంది.

పాకిస్తాన్ క్రికెట్ జట్టు పర్యటన అక్టోబరు 21 వ తేదిని ప్రారంభమై డిసెంబరు 30 వ తేదిని ముగియగలదని తెలుస్తున్నది. ఆస్ట్రేలియా సర్వీసెస్ జట్టు 1945 లో ఇండియాలో పర్యటించినప్పుడు అవలంబించిన పద్ధతి నే అనుసరించి, ఈ పర్యటనకు కూడా కార్యక్రమం ఏర్పాటు చేయ డమౌతుంది. అయిదు 'టెస్టు' పోటీలుకూడా జరుగుతవి.

## ప్రెసిడెన్సీ ఫుట్ బాల్ టూర్నమెంటు

మద్రాసు, జూలై 22: గతసాయంకాలం ఐలెండ్ గ్రౌండ్సులో జరిగిన ప్రెసిడెన్సీ ఫుట్ బాల్ టూర్నమెంటు రెండవరౌండు ఆటలో మలబార్ జిల్లా ఫుట్ బాల్ సంఘం జట్టు 3-0 స్కోరుతో సులభంగా త్యాగరాయ నగర్ ఫుట్ బాల్ క్లబ్ జట్టును ఓడించారు.

## వెల్ష్ టెన్నిస్ టూర్నమెంటు

న్యూపోర్టు, జూలై 20: ఇండియా టెన్నిస్ ఆటగాడు నరేష్ కుమార్ ఈ రోజున వెల్ష్ లాన్ టెన్నిస్ టూర్నమెంటు మెన్స్ సింగిల్స్ సెమిఫైనల్ లో ఇ. డి. ట్రెగొన్నింగ్ ను 6-4, 6-3 స్కోరుతో ఓడించారు.

## మద్రాస్ టెన్నిస్ లీగు

మద్రాసు, జూలై 22: మద్రాసు రాష్ట్ర లాన్ టెన్నిస్ సంఘ యాజమాన్యం క్రింద జరుగుతున్న మొదటిలీగు ఛాంపియన్ షిప్ పోటీలు నేటి సాయంకాలం ప్రారంభమైనవి. ఈ పోటీలో 16 జట్లు, రాష్ట్రంలోని ప్రముఖ టెన్నిస్ ఆటగాళ్ళు పాల్గొంటున్నారు.

## వెల్లింగ్టన్ కప్ హాకీ

శుక్రవారం సాయంకాలం వర్షం వచ్చిన ఫలితంగా వెల్లింగ్టన్ కప్ హాకీ ఫైనల్సు ఆట నిలిపి వేయబడింది.



## టెండరు

పంచాయితీ బోర్డు ఆఫీసు,
వినుకొండ.

క్రింది పంతకము దారు చే 39-7-51-వ తేది సాయంత్రము 4 గంటలలోపల క్రింద వుదహరించిన పనులుచేయుటకు, సామానులు సప్లయి చేయుటకు సీల్డు టెండర్లు తీసుకొనబడును. వివరములు ఆఫీసు పనిచేయు కాలమందు తెలిసికొనవచ్చును. పనులకు మొదటగా చూపించిన డిపాజిట్టు కట్టని టెండర్లు తీసుకొనబడవు.

1. ఆర్డినరి 8 నెంబరు వీధి లైట్లు సామానులు సప్లయి చేయుటకు — డిపాజిటు రు 25/-
2. హౌంగింగు మరియు హాండ్ పెట్రోమాక్సు లైటులకు కావలసిన విడిభాగములు సప్లయి చేయుటకు. — డిపాజిట్టు రు 20/-
3. ఆఫీసుకు కావలసిన స్టేషనరి సప్లయి చేయుటకు — డిపాజిటు రు 20/-
4. ప్రస్తుతము అన్ని సామానులతో అద్దెలో వున్న 12 పెట్రోమాక్సు లైట్లు ప్రతినెల 15 రోజులు, ఆగస్టునుండి మార్చివరకు వెలిగించుటకు. — డిపాజిటు రు 100/-
5. ఇసుకవాను రోడు 8 షెడ్సు, — డిపాజిటు రు 45/-
6. పార్కు గోడ కట్టుట. — డిపాజిట్ రు 10/-

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
17-7-51. వినుకొండ.



## గ్రామస్థుల పరపతి వృద్ధి చేయాలి

### రిజర్వుబ్యాంకు గవర్నరు బి. రామారావుగారి హెచ్చరిక

బొంబాయి, జూలై 21: నేడు బొంబాయిలో అఖిలభారత షరాబుల మహాసభను రిజర్వుబ్యాంకు గవర్నరైన బి. రామారావుగారు ఉపక్రమిస్తూ యిలా అన్నారు. ఇప్పుడున్న నూతన ఆర్థిక పరిస్థితులలో గ్రామస్థుల పరపతి సౌకర్యములను వృద్ధి చేయుటకై ఒక కమిటీని గవర్నమెంటు ఏర్పాటు చేయవలెను. దేశంలో సంపదను ఉత్పత్తి చేసేది గ్రామాలలోని ప్రజలు. కాబట్టి దేశంలోని చిల్లర బ్యాంకులకు రిజర్వుబ్యాంకుతో లావాదేవీలను, సంబంధమును కల్పించి ఆ చిన్న బ్యాంకులను కట్టుదిట్టం చేయుటకు తగిన ప్రణాళికను తయారుచేయాలి. గ్రామస్థుల ఋణపరపతి సౌకర్యాల విషయమై పరిశోధించుటకు రిజర్వుబ్యాంకు పూనుకున్నది. ఈ పరిశోధన వల్ల లభించే వివరములను, ఆధారంగా తీసికొని గ్రామస్థుల ద్రవ్యసౌకర్యములకు తగినస్కీము తయారుచేయబడుతుంది.

ఈ సభకు మదనమోహన రూటాగారు అధ్యక్షత వహించారు.

## అ॥ భా॥ షరాబుల మహాసభ

బొంబాయి, జులై 21: దేశవాళీ బ్యాంకులను, రిజర్వు బ్యాంకుతో అనుసంధించ వలసిన అవసరాన్ని గూర్చి నేడిచ్చట ప్రారంభం అయిన అఖిలభారత షరాబుల మహాసభవారు భారత ప్రభుత్వానికి ఒక విజ్ఞప్తి చేసారు.

రిజర్వు బ్యాంకు గవర్నర్ శ్రీ బి. రామారావు ఈ మహాసభను ప్రారంభిస్తూ, ఈ బ్యాంకులను రిజర్వు బ్యాంకుతో అనుసంధింప చేయాలంటే, అందుకు అయిన బాధ్యతఅంతా దేశవాళీ బ్యాంకులమీదనే వున్నదని, పాత పద్ధతులను మాని కొత్త పద్ధతులలో బ్యాంకు వ్యవహారాలను నడుప వలసిందని హెచ్చరించారు.

గ్రామీణ ఋణప్రధాన వ్యవహారాలను పరిశీలించే నిమిత్తం ఒక కమిటీని నియమించ వలసిందని ఈ సభవారు ప్రభుత్వాన్ని అర్థించారు. దాదాపు 100 కిపైగా ప్రతినిధులు ఈ సభకు హాజరైనారు.

## బొంబాయి రాష్ట్రంలో బియ్యంధర హెచ్చింపు

బొంబాయి, జూలై 19: బొంబాయి ప్రభుత్వము గోధుమధర నూటికి రూ 9.47 చొ॥ యున్నూ బియ్యం ధర నూటికి రూ 2.4 చొ॥యున్నూ వచ్చే వారం నుంచీ హెచ్చించుటకు నిశ్చయించింది. ఈ ధర హెచ్చింపు రాష్ట్రమంతటా వర్తించునుగాని ఫ్యాక్టరీలు కార్మికులు ఎక్కువగా ఉన్నటువంటి బొంబాయి, అహమ్మదాబాదు, పూనా, షోలాపూరు నగరములకు మాత్రము వర్తించదు. గ్రామ ప్రాంతాలలో జొన్నలు ఎక్కువగా వినియోగపడుచున్నవనీ జొన్నల ధరను ఇప్పుడున్న పరిమితిలో నెడుంచి అమ్మించుటకు రాష్ట్ర ప్రభుత్వము రూ 1.22 కోట్లను ఖర్చు చేస్తోంది. అని సివిలు సప్లయిల శాఖామంత్రి దివాకరరావు దేశాయిగారు అన్నారు. పై చెప్పిన ధరల హెచ్చింపు మూలంగా గోధుమలకు మణుగు 1 కి రూ 2 యున్నూ, బియ్యానికి మణుగు 1 కి 0-11-0 న్నూ ధర హెచ్చగలదు. విదేశాలనుంచి దిగుమతి చేయబడిన ఆహారధాన్యాలకు హెచ్చు రేట్లు కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన కారణంచేత బొంబాయి ప్రభుత్వం యీ రీతిగా ధరలను హెచ్చించవలసివచ్చింది.

## తిరువాన్కూరులో రేషను మార్పు

జూలై 22 తేదీనుంచి తిరువాన్కూరు కొచ్చిను సంస్థానాలలో పెద్దవాళ్లకు మనిషి 1 కి రోజు 1 కి 4½ ఔన్సుల బియ్యమున్నూ 4½ ఔన్సుల గోధుమలు యివ్వబడును. 8 సం॥ గాని అంతకు తక్కువగాని వయస్సు గల పిల్లలకు పై రేషనులో సగం యివ్వబడును. గోధుమలు విధిగా కొనుక్కోవాలి. బియ్యానికి అంతటికీ బదులుగా లేదా కొంతభాగానికి బదులుగాకూడా గోధుమలు తీసికోవచ్చును. అని అధికారికంగా ఒక ప్రకటన చేయబడింది.

## డామన్ ప్రాంతంలో పోర్చుగీస్ సేనలు

బొంబాయి, జులై 19: పశ్చిమతీరంలో పోర్చుగీస్ స్థావరాల్లో ఒకటయిన డామన్ లో పోర్చుగీస్ అధికారులు 2 నెలనుంచి నీగ్రో సైనికులనూ, 200 మంది యూరపియన్ సైనికులనూ నిలిపినట్లు గోవన్ యునైటెడ్ ఫ్రంటు కార్యదర్శి డామన్ దేశాయ్ ప్రకటించారు.

గోవా ప్రజల స్వాతంత్ర్య కాంక్షలను అణచివేయడానికే ఈ చర్య తీసుకొనబడినదనీ, గోవా ప్రజలంతా ఏకమై స్వాతంత్ర్యం కొరకు కృషిచేయాలనీ ఆయన హెచ్చరించారు.

(డామన్ బొంబాయి సూరత్ లకు మధ్యగా, పశ్చిమ తీరాన్ని ఆనుకుని వున్న చిన్నప్రదేశం. డామన్, గోవా, [illegible] పోర్చుగీసు ఆక్రమణక్రింద ఉన్న భారతీయ ప్రాంతాలు)

## "భారతదేశం తటస్థంగా ఉండదు"

### డా॥ బి. వి. కేస్కారు అభిప్రాయ వివరణ

చిదంబరం, జూలై 20: చిదంబరంలో విద్యార్థుల సమావేశంలో ఇండియా ప్రభుత్వ విదేశాంగ సహాయ మంత్రియగు డా॥ బి. వి. కేస్కారుగారు ఉపన్యసిస్తూ ఇలా అన్నారు:

యుద్ధం అనేది లేనప్పుడు తటస్థంగా ఉండడం అనేది కూడా ఉండదు. ఇక ప్రపంచ యుద్ధం అనేది సంభవిస్తే భారతదేశం అంతి విస్తీర్ణం, జనసంఖ్య ప్రాముఖ్యముగల రాజ్యం జోక్యం కల్పించు కొనకుండా తొలగి యుండుటకు వీలులేదు. ఒకవేళ అలా తొలగి యుండినప్పటికీ దురవస్థపాలు కాక తప్పదు. వీలైనంతవరకు సంప్రతింపులు, రాయబారాలవల్ల సౌమ్యంగా తగాదా పరిష్కారం చేసికో వలెనని భారతదేశం కోరుతోంది. యుద్ధంలోకి దిగకుండా యుద్ధ నివారణమే యుక్తమని కోరుతోంది. రష్యాకు అమెరికాకు మధ్య సాగుతున్న మూగ యుద్ధంలో, ముసుగులో గుద్దులాటలా భారతదేశం ఏ పక్షంలోనూ చేరకుండా యథేచ్ఛగా వ్యవహరిస్తోంది. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి నాలుగేండ్లయింది. ఆర్థికంగా, పారిశ్రామికంగా, సాంఘీకంగా, భారత దేశం వృద్ధిలోకి రావలసింది. ఎవరిమీదను దండెత్తాలనే సంకల్పం భారత దేశానికి లేదు. కొరియా యుద్ధం విషయంలో దానిని విస్తరింపజేయ కూడదని భారత ప్రభుత్వం నిర్వచించిన సలహా పద్ధతి సవ్యమైన పరిజ్ఞానంతోకూడినటువంటిది. కాశ్మీర్ వ్యవహారంలో సమితి అన్యాయంగా, పక్షపాత బుద్ధితో ప్రవర్తించినా సమితిని భారతదేశం బలపరుస్తోంది.

చిదంబరం మ్యునిసిపాలిటీ బి. వి. కేస్కారు గారికి పౌరసన్మాన పత్రం సమర్పించింది.

## కాశ్మీరు సమస్య

### అశోక్ మెహతా అభిప్రాయం

హైదరాబాదు, జూలై 19: "కాశ్మీరు రంగంలో ప్రస్తుత పరిస్థితి యెట్లావున్నా, పాకిస్తాన్ 'జిహాద్' గావుకేకలు ఎంతగా వినిపిస్తున్నా కూడా కాశ్మీరు సమస్య యుద్ధంకింద పరిణమించడం వట్టికల్ల" అనిసోషలిస్టు పార్టీ కార్యదర్శి అశోక్ మెహతా గారు ఇవాళ ఇక్కడ ఉద్ఘాటించారు.

"ఒకవేళ యుద్ధం వచ్చినా కూడా దానిమూలాన జాతీయ జీవనానికి దెబ్బ తగులుతుందనుకోవడం కష్టం. యుద్ధం ఒకవంక జరుగుతూవున్న సమయంలో కూడా యథా ప్రకారం ఎన్నికలు జరిపినదేశాలు లేకపోలేదు. అటువంటి పరిస్థితుల్లో ఇండియా ఎన్నికలు జరప గలుగుతుందా, లేదా అన్నది యుద్ధం యొక్క స్వభావంమీదా, దాని తీవ్రత మీదా ఆధారపడి వుంటుంది" అని ఆయన అన్నారు.

కాశ్మీరులోని ప్రస్తుత పరిస్థితి మూలంగా జనరల్ ఎన్నికలేమైనా వాయిదా పడునా అన్న ప్రశ్నకు మెహతాగారు చెప్పిన సమాధానమిది.

తెలంగాణా కమ్యూనిస్టులను గూర్చి మాట్లాడుతూ ఆయన ఇట్లన్నారు: "హైదరాబాదు ప్రజలు కమ్యూనిస్టులతో ఎంత మాత్రమూ సహకరించడం లేదు. హింసాపద్ధతులతో కమ్యూనిస్టులు ప్రజలను హడలగొట్టుతూ వుంటే వుండవచ్చునుగాక! ప్రజల సహకారం వారికి బొత్తిగా లేదు. ఎ. యస్. ఆర్. చారి అనే ఒక కమ్యూనిస్టు నాయకుని ఒక రహస్య లేఖ ప్రస్తుతం నా స్వాధీనంలో ఉన్నది. కమ్యూనిస్టులకు తెలంగాణా ప్రజల సహకార ప్రోత్సాహాలు సర్వ శూన్యమని ఆ లేఖ ఋజువు చేస్తున్నది. తమ పార్టీకి ఎన్నికల్లో నమ్మకం లేదనీ, అయినా ప్రజలకు వాటిలో నమ్మకం వుంది కాబట్టి ప్రస్తుతానికైనా మనం ప్రజల కోరికను పాటించవలసి వుంటుందని చారిగారు ఆ లేఖలో కమ్యూనిస్టు పార్టీకి విన్నవించుకొన్నారు."

## నియోగీ కార్యక్రమం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, జూలై 19: ఆర్థిక కమిషనుకు అధ్యక్షులుగా ఎన్నుకోబడిన కె. సి. నియోగిగారు ప్రస్తుతం న్యూఢిల్లీలో తమపని ప్రారంభించడానికి అవసరమైన తొలిచర్యలు చూచుకొంటున్నారు. చట్టం మేరకు మరి ముగ్గురు సభ్యులను నియమించ వలసి వుంది. వారిలో ఒకరు రిటైరైన హైకోర్టు జడ్జిగానూ, ఇంకొకరు ఏదైనా ఒక రాష్ట్రం తాలూకు మాజీ మంత్రిగానూ మరొకరు ప్రముఖ ఆర్థిక వేత్తగానూ ఉండాలి. కొన్ని పేర్లు ఇదివరకే సిద్ధంచేయబడ్డాయి. మిగతా సభ్యుల ఆఖరు ఎన్నిక విషయమై నియోగిగారు ఆర్థికమంత్రివర్గం వారితో సంప్రతింపులు సాగిస్తున్నారు. ఒక్కొక్క రాష్ట్రంనుంచి ఒకరికంటే ఎక్కువ తీసుకోరని తెలుస్తున్నది. ఈవిషయమైన ప్రకటన త్వరలోనే వెలువడుతుంది.

## స్పెయిన్ కు 750 కోట్ల డాలర్ల అప్పు

వాషింగ్టన్, జూలై 20: స్పెయిన్ రైల్వేల అభివృద్ధికోసం 750 కోట్ల డాలర్ల అప్పును మంజూరు చేసినట్లు అమెరికా ఎగుమతి దిగుమతుల బ్యాంకు నేడు ప్రకటించింది. స్పెయిన్ సహాయార్థం అమెరికన్ కాంగ్రెస్ ప్రత్యేకించిన 6250 కోట్లలోనిదే ఈ అప్పు.

# 'భాషారాష్ట్ర విభజనకు ఏ సమస్యా అడ్డురాదు'

## విజయవాడలో అశోక్ మెహతా ప్రకటన

(స్వకీయ విలేఖరి)

విజయవాడ, జూలై 20: భారత సోషలిస్టు నాయకుడు శ్రీ అశోక్ మెహతా నేడిచ్చట పత్రికావిలేఖరుల సమావేశంలో మాట్లాడుతూ, ఆసియా దేశాల సోషలిస్టు మహాసభ 1952 సంవత్సరారంభం లోనే జరుగవచ్చునని వెల్లడించారు.

ప్రపంచ సోషలిస్టుకూటమిని ఏర్పరచటానికి జరుగుతున్న కృషిగురించి చెబుతూ, "క్రిందటి సంవత్సరం ఫ్రాంక్ ఫర్టులో వివిధదేశాల సోషలిస్టు ప్రతినిధులు సమావేశమైనారు. భారత సోషలిస్టులు ఆ సమావేశకర్తల ప్రయత్నాల్ని గమనిస్తున్నారు." అని మెహతా అన్నారు. "అయితేముందు ఆసియా దేశాల సోషలిస్టు కూటమిని ఏర్పాటుచేయాలని భారత సోషలిస్టుల అభిమతం. డా॥ రామమనోహర్ లోహియా యీ విషయమై బర్మా వెళ్ళారు. శ్రీమతి కమలాదేవి అరబ్ దేశాలకు, ఇజ్రేల్ కు వెళ్ళివచ్చారు. ఇండొనేషియాలో డా॥ సుల్తాన్ షరీర్ సోషలిస్టు సంస్థను నిర్మిస్తున్నారు. ఈనెలాఖరుకు జపాన్ సోషలిస్టుపార్టీ అధ్యక్షుడు భారతదేశం రానున్నారు. అసలు అనేక ఆసియా దేశాల్లో ఎన్నికల కాలం ఇది. ఈ ఎన్నికలన్నీ ముగిసినతర్వాత, బహుశా 1952 సంవత్సరాదిలోనే ఆసియా దేశాల సోషలిస్టు మహాసభ జరగవచ్చు. సోషలిస్టులు అవలంబించాల్సిన విధానాలు దేశదేశానికి వేరువేరుగా ఉన్నవి. ఈ సమస్యలు అన్నిటిని సమన్వయపరచి పనిసాగించగల ప్రపంచ సమాఖ్య త్వరలోనే ఏర్పడుతుంది అని శ్రీ మెహతా ఆశించారు.

### ఆంధ్రప్రజాపార్టీ

రానున్న ఎన్నికల దృష్ట్యా ప్రజాపార్టీతో సోషలిస్టులు కుదుర్చుకొంటారనుకున్న సంబంధంపై మాట్లాడుతూ, అసలు ప్రజాపార్టీ రాజకీయాలు తమకు గంద్రగోళంగా కనిపిస్తున్నాయని అన్నారు. ఈమధ్య ఆంధ్ర ప్రజాపార్టీని అఖిల భారత సంస్థకు అనుబంధం చేయడంలో యన్. జి. రంగాగారవలంబించిన విధానాన్ని చర్చిస్తూ యిలా అన్నారు. రాష్ట్ర సమాఖ్య సిద్ధాంతముపై ఏర్పడిన జాతీయప్రభుత్వపు (ఫెడరల్ గవర్నమెంటు) పరిపాలనవల్ల జాతీయైక్యత కొంత బలహీనపడడం సంభవం. అట్టి ప్రమాదాన్ని తొలగించుటకు 'కేంద్రీకృతమైన సుసంఘటితమైన రాజకీయ సంస్థల నిర్మాణము అత్యవసరము—యిది ప్రొఫెసర్ లాస్కీ సూక్తి.

రానున్న ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికలో ఇంకో మూడు ఓట్లు రంగాగారికి వచ్చినట్లుంటే, రంగాగారికి కాంగ్రెసు అనుకూల సంస్థగా ఉండేది. లేక భారత కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ కార్యాచరణ సంఘంలో ఒకస్థానం లభించినట్లుంటే, రంగాగారికి ప్రజాపార్టీ చాలా అనువైనసంస్థ అయ్యేది. తనకు ఉన్నత స్థానం సమర్పించని సంస్థ సరియైనది కాదు అనుకోవటం మంచిపనికాదు. పైగా అనేక సమస్యల్ని సంపూర్ణ జాతీయ దృక్పథంతో విచారించి ముఖ్యనిర్ణయాల్ని తీసుకోవలసిన కాలం ఇది. జాతీయ అభివృద్ధి ప్రణాళికదృష్ట్యా మాత్రమే రాష్ట్రాల అభివృద్ధి, నేటి వ్యవస్థలో సుసాధ్యం. ఉదాహరణకు, నూలుసమస్యను పరిశీలించండి. దీన్ని ఏదోఒక్క రాష్ట్రం స్వతంత్రంగా పరిష్కరించలేదు. ఇది జాతీయసమస్య. ఇట్లే అనేక విషయాలు జాతీయ ప్రాముఖ్యతగలవి; ఒక బలీయమైన జాతీయ సంస్థ మాత్రమే పరిష్కరింపగలవి. అట్లాంటప్పుడు, ప్రతి ప్రదేశశాఖ స్వతంత్రం కావాలనటం రాజకీయ కౌశలానికి చిహ్నం కాదనాలి. ఎన్నికలమైత్రి అంటే మైత్రి చేసుకున్న పక్షాల అభ్యర్థులు పోటీ పడక పోవటం. మరి ఆంధ్రదేశంలో ఇట్టి మైత్రిని రంగాగారితో చేసుకోవాలా—ప్రకాశంగారితో చేసుకోవాలా? ముందు సంగతులు ఎట్లా ఉన్నా ప్రస్తుతం సోషలిస్టుపార్టీ దేశం మొత్తం మీద నిర్ణయించిన 3,500 శాసనసభా స్థానాలకు దాదాపు 2,200 స్థానాలకు పోటీ చెయ్యదల్చింది. రాజకీయ పక్షాలకు జరిగే మైత్రి, ఎన్నికల వరకే గాక, తర్వాత శాసనసభల్లో కలయిక కూడా కావచ్చును."

### భాషా రాష్ట్రాలు

ఆంధ్రరాష్ట్ర నిర్మాణంపై ప్రధానమంత్రి శ్రీ జవహర్లాల్ నెహ్రూ బెంగుళూరులో చేసిన ప్రసంగాన్ని పురస్కరించుకొని, శ్రీ మెహతా—ఇప్పుడు హైదరాబాదు సంస్థానాన్ని విచ్ఛిన్నం చేసి విశాల భాషా రాష్ట్రాల్ని ఏర్పాటు చేయటానికి, కాశ్మీర్ సమస్య లాంటి సమస్య అడ్డు వస్తాయి అనుకోటం హాస్యాస్పదం. చేయదలచుకొన్న పనులకు అనేకఅడ్డంకులు వస్తాయి. అసలు కాంగ్రెసు వారికి భాషా రాష్ట్ర నిర్మాణం [illegible] సంకల్పంకాదు. ఆంధ్ర మంత్రులకు—మద్రాసు ప్రభుత్వం వారైతేసరే, హైదరాబాదు వారైతేసరే—ఆంధ్ర రాష్ట్రం అక్కర్లేదు. కాంగ్రెసువారు ఎన్ని తీర్మానాలుచేసినా, ఈ భాషా రాష్ట్ర సమస్యవారు తీర్చేదికాదు. కాంగ్రెసువారు తల్చుకుంటే ఇప్పుడు రాష్ట్రనిర్మాణానికి అడ్డు ఏమి ఉండగలదు? సోషలిస్టులు తక్షణ భాషా రాష్ట్ర నిర్మాణానికి సుముఖులు, అని శ్రీ మెహతా నొక్కి చెప్పారు.

### రైల్వే సమ్మె

రైల్వే పనివారిసమ్మెను గురించి మాట్లాడుతూ, కొంతకాలంక్రిందట భారత ఆర్థికమంత్రి ధరలను తగ్గిస్తామని రైల్వేకార్మికుల ప్రతినిధుల్తో చెప్పారని, కాని అట్టి అవకాశం అంతరించినట్లు ప్రత్యక్షంగా కనపడుతోందని అన్నారు. పైగా ప్లానింగ్ కమీషన్ వారి నివేదికను చూడగా, ఇంక ధరలు తగ్గవు, అని తేలిపోతున్నది. అలాంటప్పుడు వేతనాలు పెరగాలి. ఈ విషయమై మధ్యవర్తుల తీర్పును వింటామని కార్మికులు అన్నారు. లేక ప్రభుత్వం, కార్మిక ప్రతినిధులు పరస్పర సంభాషణలు జరుపుకొని ఒక నిర్ణయానికి రావచ్చుననికూడా ప్రభుత్వాన్ని కార్మికులు కోరారు. ప్రభుత్వానికి ఈ సూచనలుగాని ఈ కోర్కెలుగాని, ఏవీ నచ్చలేదు. అందువల్ల కార్మికులు ఓట్లు తీసుకొని సమ్మెచేయ నిశ్చయించారు. ముందు ముందు ఏమి జరుగుతుందో చెప్పలేను అన్నారు.

శ్రీ మెహతా, భారత సోషలిస్టు పార్టీ సహాయ కార్యదర్శి శ్రీ ప్రతాప్ షాతో కలసి నేటిఉదయం హైదరాబాదునుంచి వచ్చారు. ఇవాళ ఆంధ్ర సోషలిస్టుపార్టీ కార్యవర్గ సమావేశం జరిగింది. జిల్లాలపార్టీ నిర్వాహకులు కూడా సమావేశానికి వచ్చారు. శ్రీ మెహతా, ఎన్నికలదృష్ట్యా ఆంధ్ర సోషలిస్టుపార్టీ పరిస్థితుల్ని తెలుసుకోటానికి వచ్చారని తెలుస్తున్నది. నేటి సోషలిస్టుల సమావేశాల్లో శ్రీయుతులు మద్దూరి అన్నపూర్ణయ్య, పన్నప నేని వెంకటరావు, బి. యస్. మల్లిఖార్జునరావు, తిలక్, అవధాని, గుత్తా రాజారావు, యం. బాలకృష్ణ, జి. సి. సంకన్న, రాఘవాచారి, సుబ్బారెడ్డి, భూపతి కోటేశ్వరరావు, పాతూరి వెంకటేశ్వరరావు, ఇంకా అనేకులు పార్టీసేవకులు పాల్గొన్నారు.

నేటిరాత్రి శ్రీ మెహతా హైదరాబాదుకు వెళ్ళిపోయారు. (స్వ. వి.)

## త్యాగికి రాజీనామాచేసే ఉద్దేశ్యం లేదు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, జులై 19: యూనియన్ స్టేట్ మంత్రి మహావీర త్యాగిగారికి మంత్రివర్గ సభ్యత్వంనుంచి రాజీనామా చేసే ఉద్దేశ్యం లేదు. బయటి నుంచి దురాక్రమణా, లోలోపల రైల్వే తపాలా ఉద్యోగుల సమ్మెలూ దేశాన్ని బెదరగొడుతున్న యీ సమయంలో నెహ్రూగారికి సర్వవిధాలా సహాయపడవలసి వున్నదని ఆయన అభిప్రాయపడుతున్నట్లు విషయజ్ఞుల మూలంగా తెలుస్తున్నది. తన వైఖరిని వెల్లడిస్తూ ఈ వారాంతం లోపల ఒక ప్రకటన చేయడానికి ఆయన ఉద్దేశించి వున్నారు.

## బహుమతి ప్రదానసభ

కోజికోడ్, జులై 18: ఈనెల 26వ తేదీనాడు సాయంత్రం స్థానిక పురమందిరమందు జరుగనున్న బహిరంగ సభలో అఖిల భారత కథానిక పోటీలో ప్రథమ, తృతీయ బహుమానాలు గడించిన కె. టి. మహమ్మద్, యు. యస్. మీనన్ గార్లకు వారివారి బహుమానం మొత్తాలు (రూ. 1500, రూ. 750) సమర్పించడం జరుగుతుంది. నాటిసభకు విద్యామంత్రి కె. మాధవమీనన్ గారు అధ్యక్షత వహిస్తారు.

## కరంత్ రాజీనామా?

మంగళూరు, జూలై 16: మద్రాసు మాజీమంత్రి కె. ఆర్. కరంత్ త్వరలోనే కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా ఇస్తారని తెలుస్తున్నది.

అప్పుడే ఆయన కృపలానీగారితో సంప్రదించటం జరుగుతున్నది. ఆయన పార్టీ కార్యక్రమం సమ్మతమయితే కరంత్ గారు అందులో చేరవచ్చును. లేకపోతే స్వతంత్ర అభ్యర్థిగా వచ్చే ఎన్నికలలో పోటీ చేయవచ్చును.

## సమితికి యుగోస్లావియా సేనలను ఇవ్వలేదు

సమితి కార్యాలయం, జులై 18: రష్యా, తదితర తూర్పు యూరప్ దేశాలనుంచి వస్తున్న తీవ్రమయిన ఒత్తిడి వల్ల సమితి ఉపయోగానికై యుగోస్లావియా ఇప్పుడు సేనలను ప్రత్యేకించలేదు. అని సమితిలో యుగోస్లావ్ ప్రతినిధి బెబ్లర్ సమితి సమిష్టిచర్యల సంఘానికి జవాబిస్తూ వెల్లడించారు.

సోవియట్ ఒత్తిడి ప్రస్తుతం ఉన్నంత తీవ్రంగా ఇంతకు ముందెప్పుడూ లేదనీ, సరిహద్దు సంఘటనలు అక్రమంగా వాయుమార్గాల హెచ్చింపు మొదలైనవి దానికి సంబంధించిన చర్యలని ఆయన వివరించారు.

## జనాభాను బట్టి అసెంబ్లీ స్థానాలు

### భారత క్రైస్తవులకు శ్రీ జగజ్జీవనరాం హామీ

మదరాసు, జులై 22: వచ్చే ఎన్నికల్లో కాంగ్రెసు తరఫున పోటీచేయుటకు జనాభానుబట్టి క్రైస్తవులను నిర్ణయించాలని ప్రదేశ్ కాంగ్రెసు సంఘాలను కోరెదనని ఇండియా ప్రభుత్వ కార్మిక మంత్రి శ్రీ జగజ్జీవనరాం నిన్న సాయంత్రం వై. యం. సి. ఎ. లో భారత క్రైస్తవసంఘంలో ప్రసంగిస్తూ హామీ ఇచ్చారు. సభకు డా॥ పి. వి. చెరియన్ అధ్యక్షత వహించారు.

దేశాన్ని కలవరపెడుతూ ఉన్న బ్రహ్మాండమైన నిరుద్యోగ సమస్యను సమీక్షిస్తూ భారతప్రభుత్వము ప్రాజక్టులు, ప్రణాళికలద్వారా ఎట్లు పరిష్కరించ యత్నిస్తూ వున్నదీ వివరించి శ్రీ జగజ్జీవనరాం విశదపర్చారు.

ప్రారంభంలో డా॥ చెరియన్ మాట్లాడుతూ నూతన అసెంబ్లీలో క్రైస్తవులకు కనీసం 18 స్థానాలు ఇవ్వాలని అన్నారు. ఉద్యోగాలలో కూడా క్రైస్తవులకు న్యాయం జరుగుట లేదన్నారు.

శ్రీ జగజ్జీవనరాం ప్రసంగిస్తూ లౌకిక రాజ్యంలో అధిక సంఖ్యాకవర్గమునకు చెందినా, అల్పసంఖ్యాక వర్గమునకు చెందినా అందరికీ సమానఅధికారాలు, సమాన అవకాశాలు వుంటాయనీ, భారత రాజ్యాంగంలో అల్పసంఖ్యాకులకు సంపూర్ణ స్వేచ్ఛా, హామీ ఇవ్వబడిందని అన్నారు.

ఉద్యోగాల్లో క్రైస్తవులకు ప్రాతినిథ్యం గూర్చి మాట్లాడుతూ షెడ్యూలు జాతులకు ఇచ్చే సౌకర్యాలను క్రైస్తవులకు కూడా రాష్ట్రప్రభుత్వాలు కలుగచేయాలని కార్మికమంత్రి సూచించారు.

ప్రత్యేక సమస్యలుగాక అందరికీ వర్తించే సమస్యలు కొన్ని వున్నాయి. అందులో నిరుద్యోగంఒకటి. మన పరిశ్రమలు శైశవావస్థలో వున్నాయి. వ్యవసాయమూ అభివృద్ధి కాలేదు. ప్రభుత్వమువారు తలపెట్టినప్రాజెక్టులు ఇతర ప్రణాళికలు అమల్లోకివచ్చిన ఉద్యోగము ఏర్పడుతుంది. కాని ఇందుకు కొంతకాలంపట్టుతుంది. నిరుద్యోగం బ్రహ్మాండమైన సమస్య. ఏఒక్కదానివల్లాపరిష్కారం కాదు. అదీగాక చదువుకున్న వారిలో వృత్తివిద్యపట్లఅనవసరంగాఒక ద్వేషం వుంది. ఇప్పుడిప్పుడే ఈదృక్పథం మారుతోంది. వృత్తివిద్యలకు మారిన నిరుద్యోగం తగ్గుతుందని శ్రీజగజ్జీవనరాం అన్నారు.

కాంగ్రెసు అల్పసంఖ్యాకుల సంరక్షణకు కట్టుబడింది. కాంగ్రెసు నిలిచినా, పతనమైనా మాట నిలుపుకోటంమీద వుంటుంది. ఇక ముందు ఏకొద్దిమందో ఏ ఒక వర్గమో, కులమో లిష్ట వేసుకొని ప్రభుత్వాన్ని నడుపుదామనుకుంటే కొనసాగదని కార్మిక మంత్రి అన్నారు. జె. యం. విల్సన్ మాట్లాడిన తరువాత శ్రీఆర్. జె. పీటరు అభినందనలు తెలిపారు.

## హరిజనుల రాయబారం

మదరాసు, జులై 21: శ్రీఎ. యం. రత్నస్వామి యం. పి. శ్రీ కె. పట్టాభిరామయ్యగార్లు నేడు శ్రీవి. పరమేశ్వరన్ గారి ఇంట్లో బసచేస్తూ వున్న కార్మికమంత్రి శ్రీజగజ్జీవనరాం వద్దకు హరిజనుల తరఫున రాయబారం వెళ్ళారు.

వెనుకబడిన జాతులకు రాజ్యాంగ రక్షణ ఇచ్చినందుకు కృతజ్ఞత తెలిపి వెనుకబడిన వారికి ఉపకార వేతనము లిచ్చుటకు ఎక్కువ మొత్తం కేటాయించాలని రాయబారులు విన్నవించుకున్నారు.

## మలయా కమ్యూనిస్టు

సింగపూరు, జూలై 21: కమ్యూనిస్టు విధ్వంసకారుల నాయకుడు సీతోచుక్ ను దక్షిణమలయాలో ప్రభుత్వ సైనికులు ఈరోజున తుపాకితో కాల్చి చంపారు.

## రేడియో

### జూలై 24 మంగళవారం

**విజయవాడ**

ఉ॥ 7 తెలుగున వా॥ 7.15 మద్రాసు (ఎ) వలె 7-30 మద్రాసు వలె 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12.30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు హిందీపాఠము జీవిత పరిణామము భూమి చరిత్రలో మధ్యయుగము ప్రసంగం ఎ. వి. ఎస్. రామారావు 1 మద్రాసు (బి) వలె 1-30 ఆంగ్లమున వా॥ 1-40 హిందీలో వా॥ 1.50 తెలుగున వా॥ 2 మద్రాసు (బి) వలె 2.15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు భారత కవిత్రయము తిక్కన ప్రసంగం సంగీత రచనాకారులు [illegible] ప్రసంగం 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు నగరములో గాథలు [illegible] ప్రసంగం బృందగానము [illegible] ప్రఖ్యాత దుర్గములు భరతపుర దుర్గము ప్రసంగం టి. హనుమంతరావు.

సా॥ 5.30 శకుంతలా ఆనందరావు 6 ఆంగ్లమున వా॥ 6.10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 గీతమంజరి (బి) 6.30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయగోష్ఠి. చేకొనవే భక్తిగీతం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7.15 గ్రామస్థుల కార్యక్రమం గోష్ఠి గానము 7-30 సంగీత శిక్షణ 7-45 చిత్రవాణి (బి) 8 తిరుపతి వెన్నారావు వయొలిన్ 8.20 శకుంతలా ఆనందరావు 8-40 తిరుపతి వెన్నారావు వయొలిన్ 9 ఆంగ్లమున వా॥ 9-15 ఆంగ్లమున ప్రశ్నోత్తరముల కార్యక్రమం విశ్వవిద్యాలయాలకు 9-30 ముగింపు.

**మద్రాసు (ఎ)**

ఉ॥ 7 స్వాగతము 7-30 వెంకోబ హెచ్. పద్మనాభన్ 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12.30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు తమిళమున 1 మహిళామండలి బాలత్రిపురసుందరి (బి) వివాహము వీణ [illegible] ప్రసంగం టి. వసంతలక్ష్మి వార్త సమ్మేళనము మహిళాలోకం [illegible] ఎం. కమల 1.30 ఆంగ్లమున వా॥ 1.40 హిందీలో వా॥ 1.50 ఫిలిం సంగీతం (బి) అపూర్వ సహోదరగళ్. కృష్ణవిజయం. రత్నన్ 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు తమిళమున 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు తమిళమున 4.30 పాశ్చాత్య సంగీతం (బి).

సా॥ 5-30 టి. ఎస్. నారాయణరావు వయొలిన్ 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6.20 కె. వి. కృష్ణన్ 7 డి. కె. పట్టమ్మాళ్ (బి) 7-30 తమిళమున పుస్తక విమర్శ 7.45 కారైకుడి సాంబశివయ్యర్ వీణ 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీపాఠము 9.30 (బి) వలె 10 వాద్యసంగీతం (బి) 10-30 ముగింపు.

**మద్రాసు (బి)**

ఉ॥ 7 తెలుగున వా॥ 7.15 ఉదయగానము (బి) రాధ జయలక్ష్మి చూడామణి 7.30 (ఎ) వలె

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు హిందీ పాఠము జీవిత పరిణామము భూమి చరిత్రలో మధ్యయుగము ప్రసంగం ఎ. వి. ఎస్. రామారావు 1 గీతమాలిక (బి) 1.30 (ఎ) వలె 1.40 ఫిలిం సంగీతం (బి) 1.50 తెలుగున వా॥ 2 సారంగి [illegible] 2.15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు భారత కవిత్రయము తిక్కన ప్రసంగం సంగీత రచనాకారులు [illegible] ప్రసంగం 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు నగరములో గాథలు [illegible] ప్రసంగం బృందగానము [illegible] ప్రఖ్యాత దుర్గములు భరతపురదుర్గము ప్రసంగం టి. హనుమంతరావు.

సా॥ 5.30 (ఎ) వలె. 6.20 సాయంసంగీతం (బి) 6.30 గ్రామస్థుల కార్యక్రమం. వ్యవసాయ గోష్ఠి. చేకొనవే భక్తిగీతం. విశేషాలు. ప్రకటనలు, ధరలు, వాతావరణము. 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థులకార్యక్రమం. గోష్ఠిగానము. 7-30 పుస్తకసమీక్ష. ఆచార్య ఆత్రేయ. 7-45 (ఎ) వలె. 9-15 తమిళమున సీరియల్ నాటిక. 9.30 [illegible] వి. రామచంద్రన్. 10 (ఎ) వలె. 10-30 ముగింపు.

**హైదరాబాద్**

ఉ 7 తెలుగున వా॥ 7.15 హిందీలో కార్యక్రమవిమర్శ. 7-20 హెచ్. ఎస్. గురురాజారావు. 7-50 గీతమంజరి (బి). 8 ఆంగ్లమున వా॥ 8.15 హిందీపాఠము. 8-30 శాస్త్రీయ సంగీతం. వన్నే బాబూకన్వర్. 8.50 [illegible] ఎం. ఎస్. ఖాన్.

మ॥ 12.30 మిశ్రసంగీత (బి) 1 యుగళగీతాలు (బి) 1.10 కదంబం (బి). 1-30 ఆంగ్లమున వా॥ 1.40 జలపాతము (బి). 1.50 తెలుగున వా॥

సా॥ 5.30 మహారాష్ట్రమున కార్యక్రమం. 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు. 6.20 ఖయాల్ వన్నే బాబూకన్వర్. 6-35 [illegible]. 6-45 గ్రామసీమ ప్రసంగం, ఇ. వి. ఎస్. ప్రకాశరావు. 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ కారుమూరు. నాటిక. రచన కె. ఎల్. నరసింహారావు. విశేషాలు. మార్కెట్ ధరలు వాతావరణము. 8-15 నేటి హైదరాబాదు సాహిత్యకీర్తులు. మహారాష్ట్రము. ప్రసంగం. ఎస్ ప్రతాపరెడ్డి. 8.30 తంత్రకారి 8 45 సితార్ [illegible]. అబ్దుల్ హలీమ్ జాఫర్ ఖాన్. సారంగి [illegible] షకూర్ ఖాన్. 9 ఆంగ్లమున వా॥ 9.15 హిందీలో వా॥ 9.30 [illegible] హరికథా కాలక్షేపం ముట్నూరి యజ్ఞనారాయణశర్మ. 10.15 ముగింపు.

## అమెరికాలో వరదలు

సెంట్ లూయీ (మిసోరి) జులై 20: ఇచ్చటికి 10 మైళ్ళ దూరమున మిసోరీనది కట్టలను దాటి ప్రవహించుచుండుట వల్ల యిచ్చటి ప్రజల ఆదుర్దా హెచ్చెను. ఈజిల్లావాసులను గతరాత్రి ఇతర ప్రదేశాలకు పంపి వేశారు. ఇచ్చటికి 15 మైళ్ల దూరమున ఆల్టన్ ప్రాంతములో గూడ మిసోరీ నది కట్ట తెంచుకొని ప్రవహిస్తున్నది. ఆ ప్రాంత ప్రజలను గూడ పంపివేయడానికి సన్నాహాలు చేస్తున్నారు. రోడ్లు అన్నిటిని మూసి వేశారు. మిసోరీ మీద ఒక వంతెన మాత్రమే మిగిలి వున్నది.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.